# వీక్షణం

ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 23 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | నవంబర్ 16-30, 2004



గౌరవ సంపాదకులు:

ఎ.బి.కె.ప్రసాద్

సంపాదకులు:

వి.హనుమంతరావు

సలహా మండలి:

ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు

ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ

ప్రొ॥ చక్రధరరావు

కాత్యాయని

బి.సాంబశివరాజు

ఎన్.వేణుగోపాల్


లోపలి పేజీల్లో...




విడి ప్రతి: రూ॥ 6/-

వార్షిక చందా:రూ॥140/-లు


సంపాదకీయం:

## చట్టం ఎదుట అందరూ సమానులు కాదు!

కంచి కామకోటి పీఠాధిపతి జయేంద్ర సరస్వతిని ఒక హత్యకేసులో కుట్రదారుగా అభివర్ణిస్తూ నిర్బంధించడం, విచారించడం దేశ వ్యాప్తంగా పెద్ద ఎత్తున సంచలనం సృష్టిస్తున్నాయి. ఒకవైపు 'చట్టం ఎదుట అందరూ సమానులేనని తన ప్రభుత్వం రుజువు చేసింద'ని తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత గొప్పలు చెప్పుకుంటుండగా, ఈ అరెస్టు, 'వేధింపు' హిందూ మనోవిశ్వాసాలను గాయపరచడానికే జరుగుతున్నాయని సంఘపరివార్ ఆందోళనకు దిగింది. దేశంలోని ఇతర రాజకీయ పక్షాలు, పత్రికలు కూడా ఈ ఉదంతం గురించి గోడమీది పిల్లి వాటంగా వ్యవహరిస్తున్నాయి.

ఈ వ్యవహారానికి సంబంధించి అన్ని రాజకీయ పక్షాలను, అధికార, న్యాయ యంత్రాంగాలనూ అడగవలసిన ప్రశ్నలు కొన్ని ఉన్నాయి.

మొట్టమొదట, భారత శిక్షాస్మృతి కొందరికి వర్తించదని, వారు రాజ్యాంగానికి, రాజ్యవ్యవస్థల చర్యలకు అతీతమైన వారని సంఘపరివారం భావిస్తోందా? జయేంద్ర సరస్వతి గాని, మరెవరయినా గాని ఒక హత్యానేరంలో నిందితులయితే వారిని నిర్బంధంలోకి తీసుకోగూడదా, విచారించగూడదా? ఏ విచారణ లేకుండా, కారణం చూపకుండా ఎవరినైనా నెలల తరబడి నిర్బంధించవచ్చునని టాడా, పోటాల వంటి క్రూర చట్టాలను అమలులోకి తెచ్చిన రాజకీయ పక్షాలు ఇవాళ ఎందుకు మాట మారుస్తున్నాయి? ఈ మార్పు ప్రజలందరికీ స్వేచ్ఛ ఇవ్వడానికా, లేక కొందరిని చట్టానికి అతీతంగా నిలబెట్టడానికా?

చట్టం ఎదుట అందరూ సమానమే అని ఇప్పుడు అంటున్న జయలలిత నిన్న మొన్నటి దాకా ఈ నేరస్తులతోటే చెట్టాపట్టాలు వేసుకుని తిరగడం, స్వయంగా తానే ఎన్నో నేరారోపణల పాలయి కూడా రాజకీయాధికారం సహాయంతో బైట పడడం నిజం కాదా?

అంటే, ఈ దేశంలో చట్టం అధికారం ఉన్నవారి చుట్టంగా మారిపోయిందని, అధికారంలో ఉన్నవారికి దూరమైన వారిమీద హఠాత్తుగా నేరారోపణలు వెల్లువెత్తుతాయని ప్రజలు భావిస్తున్నది నిజం కాదా?

ఇలా చట్టాన్ని దుర్వినియోగం చేసిన చరిత్రలో రాజకీయ పక్షాలన్నిటికీ భాగం ఉంది. అధికారంలో ఉన్నవారికి మరింత ఉంది. ఇప్పటికైనా చట్టాన్ని తమ రాజకీయ వ్యతిరేకుల మీద దుర్వినియోగం చేయడం తప్పయిందని, ఇక ముందు అలా చేయబోమని రాజకీయ పక్షాలు ప్రకటించాయి. జయేంద్ర నేరస్తుడవునా కాదా అనేది చిన్న విషయం. అన్ని రాజకీయ పక్షాలు చట్టం పట్ల తమ తప్పుడు ప్రవర్తన అనే నేరానికి బోనెక్కవలసిన సమయం వచ్చింది.

**వచ్చే సంచిక ఫోకస్: నీటిపారుదల (డిసెంబర్ రెండు సంచికలు కలిపి)**

# సమకాలీన ప్రపంచీకరణ పరమార్థం

-ప్రొ॥ప్రభాత్ పట్నాయక్
జె.ఎన్.యు.న్యూఢిల్లీ

సామ్రాజ్యవాదం తన ప్రస్తుత దశకు 'ప్రపంచీకరణ' అన్న పేరు పెట్టుకుంది. ఏమైనప్పటికి ఇది తప్పుడు పేరే! ఎందుకంటే, ప్రస్తుత దశలో దాని అంతరార్థం-సరుకులను, పెట్టుబడులను తరలించేందుకు స్వేచ్ఛాస్థాయి. అలాంటి స్వేచ్ఛాస్థాయిని పెట్టుబడిదారీ విధాన చరిత్ర మొత్తంలోనే, గతంలో ఎన్నడూ చూడలేదు. ఇది ఏ విధంగా సమర్థించతగినది కాదు. అందులో ఎలాంటి విడ్డూరమూ లేకపోవచ్చు, కాని గతంలో ఎన్నడూ లేని అసాధారణత కొంత ఉంది. అంటే అలాంటి ద్రవ్య ప్రపంచీకరణను అన్నిటికంటే ప్రధానంగా, ద్రవ్య వ్యవహారాల విస్తృత ప్రపంచీకరణ, సమాచార విప్లవం అనేవి రెండూ-సాధ్యం చేశాయి. ప్రపంచ ద్రవ్య వెల్లువలో కొత్తదనం ఏదీ లేకపోవచ్చు. మొదటి ప్రపంచయుద్ధ కాలానికి ముందు హెవ్‌ఫెర్‌డెంగ్, హాబ్సన్, లెనిన్ వంటి రచయితలు వాటి గురించి ఎంతో విస్తృతంగా చర్చించారు. కాని ప్రస్తుత 'ద్రవ్య పెట్టుబడులు' అప్పటికంటే కొంత విరుద్ధమైనవి. జాతీయ పరిధుల నుంచి అవి వేరుపడ్డాయి. (అందువల్ల అవి జాతీయ పెట్టుబడిదారీ వ్యూహాలలో భాగంగా ఉండడం లేదు). అలాగే అవి పారిశ్రామిక పెట్టుబడుల నుంచి కూడా వేరుపడ్డాయి. అందువల్ల-సామ్రాజ్యవాదుల మధ్య పోటీ కారణంగా, ఈ పెట్టుబడులు భారీ లాభాల వేటలో ఎలాంటి హద్దులు లేకుండా ప్రపంచమంతటా మరింత అస్థిరంగా ప్రవహిస్తూ స్పెక్యులేషన్ (పెట్టుబడి జూదం) వ్యాపారాన్ని తలపిస్తున్నాయి-(పట్నాయక్ 2000)

ఇవి అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడులుగా ఆవిర్భవించాయి. దాంతోబాటే 'ద్రవ్య ప్రపంచీకరణ' కూడా వచ్చింది. అదే నేటి సామ్రాజ్యవాద సారాంశంగా రూపుదిద్దుకుంది. 'ప్రపంచీకరణ'కు సంబంధించి రెండు సర్వసాధారణ అపోహలున్నాయి. మొదటిది దాని స్వభావానికి సంబంధించినది. రెండవది దాని ప్రభావానికి సంబంధించినది. నిజానికి ద్రవ్యపెట్టుబడి, దాంతో కలిసి ఉన్న ద్రవ్య ప్రపంచీకరణ సంబంధించిన ఈ కొత్తరూపం గురించి మనం మాట్లాడడం అంటే, 'పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియ' గురించి కాదు. అలా అనుకుంటే అది అసందర్భమవుతుంది. అలాగే అది, గతంలో మనం సామ్రాజ్యవాదం గురించి ప్రస్తావించినట్టు, ఉత్పత్తి నిర్వహించే బహుళజాతి సంస్థల గురించి కూడా కాదు. ఇవన్నీ అప్రధానమే. "గుత్తాధిపత్యం" పెట్టుబడిదారీ విధానంపై ఉపరితల వ్యవస్థ నిర్మాణం అని లెనిన్ వివరించాడు (1975; 114-5). అదే విధంగా పాత గుత్త పెట్టుబడి వ్యవస్థను తుడిచిపెట్టి, నూతన ప్రపంచాన్ని నిర్మించేదిగా 'ద్రవ్య పెట్టుబడి'ని మనం నిర్వచించవచ్చు. బహుళజాతి కంపెనీలు ప్రాముఖ్యతను కోల్పోవడమే కాదు, అవి ఈ ద్రవ్యీకరణ ప్రక్రియ ఫలితంగా అవి భారీ లాభాల కోసం, ప్రపంచమంతటా కారుచౌకగా ఆస్తులను స్వాధీన పరచుకోవడం కోసం ఈ ద్రవ్య ప్రపంచంతో కలగలసిపోయాయి. (భారీ బహుళజాతి సంస్థ ఎన్‌రాన్ కార్యనిర్వాహక ఉద్యోగులు స్పెక్యులేషన్ వ్యవహారాల్లో పీకల్లోతు కూరుకుపోవడం ఇందుకు ఒక ఉదాహరణ)

పాత పద్ధతిలోనే గుత్త పెట్టుబడిదారీ సంస్థలు-సమకాలీన సామ్రాజ్యవాదంలో కీలక పాత్రధారులని అనుకొన్నా 1960 దశాబ్దం నుంచి ఆ పరిస్థితులు మారలేదనుకోడం పొరపాటు. బహుళజాతి సంస్థలు తమ వైఖరులను, ప్రవర్తనను మార్చుకోకుండా అదే విధంగా నేటికీ కొనసాగుతున్నాయని భావించడం కూడా అంతే పొరపాటు. అలాగే బహుళజాతి సంస్థల గురించి అసలే మాట్లాడకుండా, నేటి ప్రాధాన్యత అంతా స్పెక్యులేషన్ ద్రవ్యపెట్టుబడులదేనని భావించడం మరీ తప్పు. గతంలో ఉన్న పాత పెట్టుబడిదారీ వ్యవస్థపై ద్రవ్య ప్రపంచీకరణను రుద్దుతున్న-రంగురంగుల-తళుకుల నూతన వాస్తవికత గురించి మనం మాట్లాడుకోవాలి.

ఈ ప్రక్రియలో ప్రాబల్యం వహిస్తున్న అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి నూతన స్వరూప అస్తిత్వం-బహుళజాతి సంస్థలతో వేరుపడినది కాదని, వాటితో కలగలసి ఉన్నదేననీ-చెప్పుకోవాలి.

ఇక రెండవ అపోహ-ఏ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికయినా, ముఖ్యంగా తృతీయ ప్రపంచ దేశాల, ఆర్థిక వ్యవస్థల అభివృద్ధికి-ఈ ప్రపంచీకరణకు తలుపులు తెరవడమే మంచిది-అన్న విశ్వాసంపై ఆధారపడి ఉంది. ప్రస్తుత పెట్టుబడుల అంతర్జాతీయ చలనశీలత వల్ల-పెట్టుబడులు ఉత్తరం నుంచి దక్షిణానికి తరలివస్తాయన్న తృతీయ ప్రపంచ దేశాల విశ్వాసంపై ఆధారపడి ఉంది. గతంలోనూ, ఆ తర్వాత కూడా ఉత్పాదక సంస్థల ఏర్పాటు చివరికి ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఒక అసమాన దృశ్యాన్ని ఖచ్చితంగా నెలకొల్పింది. ఎందుకంటే-శ్రమ, సంప్రదాయం, నైపుణ్యం మొదలైనవి దక్షిణం నుంచి ఉత్తరానికి మాత్రం తరలి వెళ్ళవు. గతంలో పెట్టుబడులు ఉత్తరం నుంచి దక్షిణానికి తరలడానికి కూడా విముఖత ఉండేది.

గతంలో తక్కువ వేతనాలకు శ్రమశక్తి లభించేది కాదు. కాని ఆ పరిస్థితి-తర్వాత మారిపోయింది. (అధిక లాభలనిచ్చే ఉత్పత్తిని

గుర్తించడం ఆ తర్వాత జరిగింది) ఇంకా, ఉత్తరం నుంచి వెలువడిన అనేక ప్రకటనలు (అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో ఓటమి పాలైన డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థి, సెనెటర్ జాన్ కెర్రీతో సహా) ఉత్తర-దక్షిణాల మధ్య పెట్టుబడిదారీ విధానం చారిత్రకంగా సృష్టించిన అగాధాన్ని ప్రపంచీకరణ-దక్షిణంలో వేగవంతమైన అభివృద్ధిని సాధించడం ద్వారా-అధిగమించగలదన్న అభిప్రాయాన్ని కలిగించాయి. ఇక్కడ, ద్రవ్య చలనం-ఉత్పాదక పెట్టుబడుల చలనం రెండూ ఒకటేనని పొరపాటు పడడం వల్లనే తప్పుజరుగుతోంది. జాన్ కెర్రీ లాంటివారు కూడా అలా అభిప్రాయ పడడం భరించరానిది. ఉత్తరం నుంచి దక్షిణానికి తరలే ఉత్పాదక పెట్టుబడులు ఇలా పరిమితం.

ఆఖరికి చైనా విషయంలో కూడా, వారు తరచు చెప్పుకొంటున్న 'విజయగాథ' ప్రకారం-వారికి అందుతున్న ఉత్పాదక పెట్టుబడులన్నీ ఖచ్చితంగా చెప్పాలంటే విదేశాల నుంచి వచ్చినవే తప్ప 'ఉత్తరం' నుంచి వచ్చినవి కాదు. ప్రత్యేక ద్రవ్య నిధులరాక వల్ల లభించే సూక్ష్మ ప్రోత్సాహకాల గురించే కెర్రీ లాంటి వారు చెబుతున్న దనడంలో సందేహం లేదు. కాని, భారీ షరతులతో-ఉత్తరం నుంచి దక్షిణాదికి ప్రవహించే ఉత్పాదక పెట్టుబడుల పరిమాణం ఇప్పటికీ పరిమితమే. (విదేశీ పెట్టుబడులు ఆస్తులను స్వాధీన పరచుకోవడానికి, లేదా రుణాలను సమాన మూలధనంగా మార్చుకోడానికీ మాత్రమే తరలివస్తాయని పేర్కొనడమే సమంజసం.)

కొత్తగా వచ్చే విదేశీ పెట్టుబడులన్నీ విధిగా అభివృద్ధిని పెంచడానికే కాదని కూడా మనం గుర్తించాలి. (దేశీయ పెట్టుబడులు లోపించినపుడు, అందుకు ప్రత్యామ్నాయంగా అభివృద్ధి నిరోధకంగానే ఉండే అవకాశం ఉంది. ఎందుకంటే వాటిలో అంతర్గతంగా విపారిశ్రామికీకరణ స్వభావమే ఉంది). అందువల్ల తృతీయ ప్రపంచ దేశాలు 'ప్రపంచీకరణ ప్రక్రియ'కు తలుపులు తెరవడం వల్ల-అధికవృద్ధి సాధించడం ఇసుమంత కూడా సాధ్యం కాదు.

మరోవైపు ప్రపంచీకృత ద్రవ్యసహాయానికి వృద్ధి ప్రతిబంధక విశిష్ట ప్రభావం ఉంది. అందువల్ల తప్పనిసరిగా అది ప్రభుత్వ వ్యయం తగ్గింపు ద్వారా, విపరీతమైన ప్రతి ద్రవ్యోల్బణాన్ని కూడా మోసుకు వస్తుంది. (యు.పి.పట్నాయక్ 2002). ఉపాధి, సంక్షేమ కార్యక్రమాల విషయంలో క్రియాశీలంగా ఉండే ప్రభుత్వాన్ని ద్రవ్యపెట్టుబడులు ఎప్పుడూ వ్యతిరేకిస్తూనే ఉంటాయి. ప్రభుత్వాలు జాతీయ ప్రభుత్వాలుగా కొనసాగడాన్ని వ్యతిరేకించే ద్రవ్యపెట్టుబడులు ఎప్పుడైతే ప్రపంచీకరణ చెందుతాయో, అప్పుడు ఆ వ్యతిరేకతకు ఒక శక్తివంతమైన ప్రభావం అప్రయత్నంగానే ఏర్పడుతుంది. ద్రవ్య పెట్టుబడుల అభ్యంతరాలను అధిగమించి ఏ ప్రభుత్వమన్నా చురుకుగా వ్యవహరిస్తే ఆ ఆర్థిక వ్యవస్థ విరుద్ధ ఫలితాలకు గురయ్యే విధంగా వలస పెట్టుబడులతో తలపడవలసిన పరిస్థితుల్లో పడుతుంది. ఈ పరిణామాలను తప్పించేందుకు, వీలైనంతగా వలస పెట్టుబడులను నిరోధించడానికి-ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడిదారుల విశ్వాసాన్ని సాధించడానికి ప్రభుత్వం ప్రతి ఒక్క ప్రయత్నాన్ని చేపట్టాల్సి వస్తుంది. అంటే దాని అర్థం 'స్పెక్యులేటర్ల' విశ్వాసాన్ని పొందడమేననీ, వారిని నిర్లక్ష్యం చేయరాదనీ మర్యాదగా చెప్పడమే.

వారు ఆ విధంగా ఉండేందుకు గాను-ఉపాధిని పెంపొందించడంలో చురుకుగా వ్యవహరించకపోతే-ఆర్థిక వ్యవస్థ ప్రతి ద్రవ్యోల్బణ ప్రక్రియకు గురవుతుంది. అది వృద్ధి రేటును క్షీణింప చేస్తుంది. ఉపాధికల్పనలో ప్రభుత్వ క్రియాశీలతకు-ద్రవ్య పెట్టుబడుల వ్యతిరేకతను ఏ సహేతుక ఆర్థిక భయాలూ వివరించ లేవు. ఉపాధికల్పన కార్యక్రమాలు ఉన్నత స్థాయిలో ఉన్నపుడు ఆర్థికమాంద్యం వచ్చే లక్షణాలు అంత స్పష్టంగా కనిపించవు. ఈ రెండు అంశాలూ మారకపు విలువ పడిపోతుందనే భయాన్ని పెంచుతాయి. ప్రపంచ ద్రవ్య లాభదాయకతపై అది ప్రతికూల ప్రభావం చూపుతుంది.

కాని అలాంటి భయాలకు తగినంత వివరణను అది సమకూర్చలేదు. ప్రభుత్వం ఉపాధి అవకాశాలను పెంపొందించడంపై ద్రవ్యపెట్టుబడుల వ్యతిరేకత-ఆర్థిక మాంద్యం, మారకపు విలువల పతనం గురించిన భయాలను తగ్గించడానికి ఆర్థిక వ్యవస్థ ఎంత కొద్దిపాటి చర్యల్ని తీసుకున్నా-వ్యక్తమవుతూనే వుంటుంది. (ఉదాహరణకి 20ల్లో, పెట్టుబడిదారీ ప్రపంచ ప్రధాన ద్రవ్య కేంద్రం ఉన్న లండన్ నగర భావంతో-బ్రిటీష్ ఖజానా-నిరుద్యోగాన్ని అధిగమించడానికి కొన్ని ప్రజా పనులను చేపట్టాలన్న లాయిడ్ జార్జ్ ప్రతిపాదనను-తిరస్కరించింది. అయినప్పటికీ, ఆ సమయంలో నిరుద్యోగం స్థాయి 10 శాతం మాత్రమే. కాని ఆ పరిస్థితిలో, కార్య కలాపాల పెరుగుదల-ఆర్థిక మాంద్యానికి గాని, పతనానికి గాని ఆస్కారం కల్పించలేని స్థాయిలోనే ఉంది)

ఉపాధి విషయంలో ప్రభుత్వాలు క్రియాశీలంగా ఉంటే, ద్రవ్యపెట్టుబడులు వ్యతిరేకించడం అనేది ఎక్కడైనా జరిగేదే. మైఖేల్ కొలికి 1943లో ప్రభుత్వ ప్రమేయం లేనపుడు, ఉపాధి అవకాశాలు 'పెట్టుబడిదారుల విశ్వసనీయత' పైనే ఆధారపడి ఉంటాయన్నది వాస్తవమని పేర్కొన్నాడు. ఆ తర్వాత దానికి ప్రభుత్వ విధానాలపై శక్తివంతమైన పరోక్ష నియంత్రణ ఏర్పడుతుంది. ఆ విశ్వసనీయతను కుదిపి వేసే ప్రతిదాన్ని జాగ్రత్తగా పరిహరించాలి. ఎందుకంటే, అది ఒక ఆర్థిక సంక్షోభానికి దారి తీస్తుంది. తమ సొంత కొనుగోళ్ళ ద్వారా ఉపాధి పెంచే చిట్కాను ఒకసారి గనుక నేర్చుకుంటే, ఆ శక్తివంతమైన నియంత్రణ సాధనం తన ప్రభావాన్ని కోల్పోతుంది (కొలికి 1971:139).

ఉపాధికల్పనపై ప్రభుత్వ క్రియాశీలత మరో విధంగా పెట్టుబడిదారీ వర్గాల సామాజిక శక్తిని నిర్లక్ష్యం చేస్తుంది. దాంతోపాటు సామాజిక సక్రమతని కూడా! ఉత్పత్తి నిర్వహించే పెట్టుబడిదారుల విషయంలోనే ఇది ఇంత వాస్తవమైతే, మరి వడ్డీ వ్యాపార వర్గాల విషయంలో సురెంత వాస్తవం కావాలి? వారిని కీన్స్ (1946) 'పనిలేని పెట్టుబడిదారులు' అని వర్గీకరించాడు. అప్పుడింక ద్రవ్య పెట్టుబడుల మాటేమిటి?

ఇక్కడ మరోఅంశం కూడా ఉంది. ప్రభుత్వరంగ సంస్థలను, సాధారణంగా పెట్టుబడిదారీ వర్గాలకు, ముఖ్యంగా ద్రవ్య పెట్టుబడులకు కారుచౌకగా అమ్మివేయడానికి-ధరల పతనంతో సంబంధం ఉంది. ఈ వ్యవహారంలో వారే లబ్ధిదారులు. మరోవిధంగా, 'ధరలపతనం' పెట్టుబడుల సమీకరణకు తొలి అవకాశంగా పనిచేస్తుంది. ప్రధానంగా, ప్రజల పొదుపు మొత్తాలతో నిర్మించిన వాణిజ్య సంస్థలను నిజానికి ఉత్తినే, అంతర్జాతీయ ద్రవ్య అధిపతుల్లో కొద్దిమందికి ధారాదత్తం చేయడం అంటే, దాని ఫలితం ఖచ్చితం గా-కొద్దిమంది పెద్ద పెట్టుబడిదారులు-అనేకమంది చిన్న పెట్టుబడిదారులను నేరుగా హరించడమే!

ప్రాథమిక సమీకరణ ప్రక్రియకు అదే ప్రధాన సూత్రమని మార్క్స్ నిర్వచించాడు. ఈ ప్రాథమిక సమీకరణ ప్రక్రియను సమర్థించడానికి, పెట్టుబడులకు-ప్రవాహానికి మధ్య పూర్తిగా గందరగోళాన్ని సృష్టించడంపై ఆధారపడిన ఒక బూటకపు సిద్ధాంతాన్ని ఇది ఆదేశిస్తోంది. ద్రవ్యలోటును అరికట్టేందుకు 'పెట్టుబడుల ఉపసంహరణ' స్పష్టమైన, సరైన మార్గమని ఈ సిద్ధాంతం బోధిస్తోంది.

దీంతోనే ద్రవ్య పెట్టుబడికి, ప్రతి ద్రవ్యోల్బణం ప్రయోజనాలు పూర్తికాక పోవచ్చు. అందువల్ల ప్రతి ద్రవ్యోల్బణం, అది సృష్టించే మాంద్యం ద్వారా-అనేకమంది చిన్న ఉత్పత్తిదారుల్ని-వారి వ్యాపారుల నుంచి, ఆస్తులనుంచి లేదా, వారు ఆక్రమిస్తున్న కొద్దిపాటి స్థానాలనుంచి గెంటివేసి, వాటిని పెద్ద పెట్టుబడిదారులకు, మరీ ముఖ్యంగా ద్రవ్య పెట్టుబడులకు అందుబాటులో ఉండేలా చేస్తోంది. ఆస్తులు చేతులు మారినపుడు సాధారణంగా అవి కారు చౌకగానే లభిస్తాయని ప్రత్యేకించి చెప్పవలసిన అవసరం లేదు.

ద్రవ్యపెట్టుబడులు విధించే ప్రతి ద్రవ్యోల్బణం స్వదేశీ డిమాండ్‌ను నిరోధిస్తుంది. అందువల్ల ఆ మార్గం ద్వారా ఆర్థికాభివృద్ధి గమనాన్ని ఆటంక పరుస్తుంది. ఇదే పనిని అది మరో మార్గంలో కూడా చేస్తుంది. ప్రపంచీకృత ద్రవ్య-ప్రతిద్రవ్యోల్బణం ఒక వ్యాప్తి చెందే అసాధారణ లక్షణం. అది కేవలం తృతీయ ప్రపంచ దేశాలకే కాక, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ ప్రపంచానికి కూడా వ్యాపిస్తుంది. ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ మొత్తం అదే స్తబ్దతను అనుభవిస్తుంది. తిరిగి అది వాణిజ్య సరళీకరణ ఆధిపత్యంలో తృతీయ ప్రపంచ జాతీయ ఆర్థిక వ్యవస్థలకు దిగుమతి అవుతుంది. ఈ రెండు కారణాలవల్ల తృతీయ ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ప్రపంచీకరణకు తలుపులు తెరచినపుడు, ఆ విధారత వృద్ధిని వేగవంతం చేసేబదులు, మాంద్యంలోకి నెడతాయి.

యుద్ధానంతర దశాబ్దాల వ్యాపారాభివృద్ధితో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ ప్రపంచ కెనీసియన్ సిద్ధాంతాల మద్దతుతో తీవ్రస్తబ్ధతను, ద్విముఖ నిరుద్యోగాన్ని ఎదుర్కొంటోంది. గత రెండు దశాబ్దాలుగా లాటిన్ అమెరికా, ఆఫ్రికాలో తలసరి ఆదాయాలు దారుణంగా క్షీణిస్తున్నాయి. 1990ల ఆరంభంనుంచి ప్రపంచీకృత ద్రవ్య వెల్లువకు తలుపులు తెరచిన తూర్పు, ఈశాన్య ఆసియా దేశాలలో కూడా నాటకీయంగా కనిపించిన వృద్ధిరేట్లు క్రమంగా తగ్గుముఖం పట్టాయి. ప్రపంచీకరణ అని నిర్వచిస్తున్న ప్రస్తుత ధర స్తబ్దత దిశగా పయనిస్తోందని చెప్పేందుకు ఇవన్నీ బలమైన సూచనలే!

అయితే, ఇండియా, చైనాలో ఈ నిర్ధారణకు విరుద్ధంగా ఉన్నాయని వాదించవచ్చు. ఎందుకంటే ప్రపంచీకరణను ఆహ్వానించినప్పటి నుంచి అవి అత్యధిక వృద్ధిని కనపరుస్తున్నాయి. కాని, చైనా విషయంలో, అది ప్రపంచీకరణకు ద్వారాలు తెరచిందా అనేది ప్రశ్నార్థకంగానే ఉంది. ఎందుకంటే అది ప్రపంచీకృత ద్రవ్య వెల్లువకు ఒక రక్షణ కవచాన్ని ఏర్పరుచుకొని (గర్భితంగానే తప్ప, బాహటంగా కాదు) ఒక స్థాయిలో వాణిజ్య పరిమితుల్ని పాటిస్తోంది.

ద్రవ్య వాణిజ్య వెల్లువకు మరింత ఆహ్వానం పలుకుతున్న ఇండియా విషయంలో, పెట్టుబడి ఖాతాను పూర్తిగా మార్పిడి చెయ్యక పోయినా, ఆర్థిక సరళీకరణను ప్రవేశపెట్టినప్పటి నుంచి, ప్రధాన వస్తూత్పత్తి రంగాల వృద్ధిరేటును క్షీణింపచేస్తోంది. ముఖ్యంగా గత పంచవర్ష ప్రణాళికాకాలం నుంచి నయా ఉదారవాద విధానాలు ద్రవ్యవేగాన్ని సంతరించుకున్నాయి. అధికవృద్ధి సాధించుకున్న వాదనలు పూర్తిగా సేవారంగం పనితీరుపై ఆధారపడి చేస్తున్నవే. అందువల్ల ఆ వాదనలు పూర్తిగా సందేహాస్పదమైనవే. ఈ రంగానికి చెందిన వృద్ధిరేటు సంఖ్యలతోబాటు, సైద్ధాంతిక, గణాంక సమస్యలు కూడా ఉన్నాయి. (చైనా విషయంలో కూడా, వారు చెబుతున్న వృద్ధిరేటు సంఖ్యల్లో అతిశయోక్తులు కూడా ఉండవచ్చు. ప్రపంచీకరణకు స్వాగతం పలకడం వల్ల వచ్చే ఈ ప్రతికూల ప్రభావంతో బాటు అనేక ప్రధాన సూచికలు సంక్షేమంపై విరుద్ధ ఫలితాలను కూడా చూపుతున్నాయి. ఇండియా విషయంలో ఇది మరింత సందేహాతీతమని దిగువ సమాచారం వెల్లడిస్తుంది.

## II

ఈ ప్రపంచీకృత స్తబ్ధతలో, ఉపాధిపై ప్రభావం ద్రవ్య ప్రపంచీకరణ నుంచి ఏర్పడుతోంది. ముఖ్యంగా తృతీయ ప్రపంచానికి ఉద్యోగాలు ఎగుమతి చేస్తున్న, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ

ప్రపంచంలో ఇలాంటిది గుర్తించడం అరుదే, అంతర్జాతీయ ద్రవ్యపెట్టుడి ప్రయోజనాలకే ఇది పని చేస్తుంది. తృతీయ ప్రపంచంలోని ఉద్యోగుల్లో ఒక వర్గాన్ని-ప్రథమ ప్రపంచానికి చెందిన మరో వర్గానికి వ్యతిరేకంగా నిలుపుతోంది. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి పాత్ర, దాని ప్రాబల్య ప్రాధాన్యత పూర్తిగా విస్మరించడం జరుగుతోంది. ఈ రెండు స్థితులూ-అంటే-ఉద్యోగుల మధ్య ఒక విభేదాన్ని ప్రోత్సాహించడం, ద్రవ్య ఆధిపత్యం గురించి మౌనం వహించడం-ఈ ఆధిక్యతను నిరంతరీకరించడానికి దోహద పడుతున్నాయి.

నిరుద్యోగానికి ప్రధానకారణం 'ఉద్యోగుల ఎగుమతి' అన్న అభిప్రాయానికి మొత్తం ఉద్యోగుల సంఖ్య పెరగక పోవడం-కొంత విశ్వసనీయతను కల్పిస్తోంది. ఏమైనప్పటికి, ఈ వాదన వాస్తవానికి దూరమే. తగిన విధంగా ప్రభుత్వం జోక్యం చేసుకోవడం ప్రస్తుత ద్రవ్యోల్బణాన్ని ఎదుర్కొన గలుగుతుంది. అది మొత్తం ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కార్యకలాపాల స్థాయిని విస్తృత పరచగలుగుతుంది. ఏ దేశ ప్రభుత్వమూ దానికి అది ఒంటరిగా-బహుశా ఉపాధి పెరుగుదల విధానాలను అవలంభిస్తున్న ఒక్క అమెరికా తప్ప-ప్రపంచీకృత ద్రవ్య సుడిగుండంలో చిక్కుకోదు. (అలా ఎప్పుడు జరుగుతుందంటే, అది కూడా ప్రపంచీకృత ద్రవ్య వెల్లువలో భాగమయినపుడే-అలాంటి వెల్లువపై ఆంక్షలు విధిస్తుంది. అందుకు అది కొంత మూల్యం చెల్లించాలి. అది సామ్రాజ్యవాద ప్రాతికూల్యత నుంచే ఏర్పడుతుంది) దాని కరెన్సీ (ప్రస్తుత యూరోశక్తితో నిలువదు) ప్రతిచోటా సంపన్నుల వద్ద చిక్కుకు పోయినందువల్లనే-అమెరికా ఈ ప్రత్యేక మినహాయింపు లభిస్తోంది. అమెరికా నుంచి పెట్టుబడులు తరలడం అనేది, ఆ దేశ ప్రభుత్వం విస్తరణ విధానాలను చేపట్టినా కూడా, అసంభవం గానే మిగులుతుంది. (బుష్ పరిపాలనలో ఆర్థిక లోటును విస్తరించిన ప్రస్తుత దశలో అది రుజువయింది)

అందువల్ల అమెరికాకు, తన సొంత ద్రవ్య విధానాన్ని విస్తృత పరచడం ద్వారా-మొత్తం ప్రపంచ ఆర్థిక వ్యవస్థనే స్తబ్ధత నుంచి బయటకు లాగగల చలనశక్తి ఉంది. కాని దాని జాతీయ దృక్పథం రీత్యా చూస్తే, అమెరికా ఆ విధమైన చలనశక్తిగా పనిచేయడం వల్ల పొందగలిగేది తక్కువే.

అందువల్ల ప్రపంచంలో ఎక్కడయినా సరే, ఉపాధి అవకాశాలను విస్తృతం చేయాలంటే అమెరికా నుంచి భారీ జాతీయరుణం అనివార్యమవుతోంది. అందువల్ల అమెరికా ప్రభుత్వం తన జాతీయ దృక్పథం నుంచి బయటకు రాలేదు, రాదు! దాని ప్రత్యేక పరిస్థితిని ఉల్లంఘించి పెట్టుబడిదారీ ప్రపంచానికి మొత్తంగా ఉపాధి పెంపొందించే విధానాలను చేపడుతుంది. కాని పెట్టుబడిదారీ ప్రపంచంలో ఉపాధి పెంపొందించేందుకు అమెరికా ఒక్కటే చేపట్టే విస్తరణ విధానం, అనేక పెట్టుబడిదారీ ప్రభుత్వాల సంయుక్త విస్తరణలో సమానం కాలేదు. అవి రెండూ సంభవించినాగాని సాధించేది మాత్రం అంతే!

నిజానికి, 1930ల నాటి బ్రహ్మాండమైన ఆర్థిక మాంద్యంలో కూడా అనేక పథకాలను చేపట్టడం జరిగింది. కిండల్బ్వే, ఫ్రాన్స్కీ, ఐఎల్ఒలు, కీన్స్ ప్లాన్ మొదలైనవి-ఖచ్చితంగా దీన్నే-ప్రధాన పెట్టుబడి దారీ దేశాల సమూహం మధ్య సంయుక్త విస్తరణను-సూచించాయి. నేడు ఈ పథకానికి నిజమైన ఆటంకం-1930లలోవలెనే-ద్రవ్య పెట్టుబడుల వ్యతిరేకత. ద్రవ్య పెట్టుబడులకు సైద్ధాంతిక ప్రాబల్యం గల చోట్ల అనేకమంది సంప్రదాయ ఆర్థిక వేత్తలు, జర్నలిస్ట్లు, కరపత్ర రచయితలు-ఆర్థికలోట్ల పట్ల అభ్యంతరాలు తెలిపారు. ఆ విధంగా ఉపాధివృద్ధికి ఆటంకం, అందువల్ల ఏర్పడే భారీ నిరుద్యోగానికి మూలం-ద్రవ్య ఆధిపత్యమే! ఆ విషయాన్ని సులభంగా కప్పిపుచ్చేందుకే, 'ఉద్యోగాల ఎగుమతి' వాదన. ఈ సమస్యని మనం దిగువ పద్ధతిలో పరిశీలిద్దాం.

ప్రస్తుత కాలంలో, ప్రభుత్వాల ఉపాధి పెంపుదల విధానాలకు ప్రధానంగా రెండు ప్రత్యేక అవరోధాలున్నాయి. మొదటిది-అలాంటి విధానాలను ద్రవ్య పెట్టుబడులు వ్యతిరేకించడం. రెండవది-ప్రభుత్వాలు జాతీయ ప్రభుత్వాలు కాగా- ప్రస్తుత ప్రపంచంలో ద్రవ్య పెట్టుబడులు-అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడులై ఉన్నాయి.

జాతీయ ప్రభుత్వాలకు బదులు, ప్రపంచ ప్రభుత్వం ఉన్నట్లయితే, ఈ కారణాలలో రెండవది, పనిచేయడం నిలిచిపోతుంది. నిజానికి ప్రపంచ ప్రభుత్వం అంటూ ఏదీ లేనందువల్ల-అది-ప్రపంచ ప్రభుత్వ ప్రతినిధిగా వ్యవహరించవలసి వస్తోంది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ మొత్తానికి అది-ఉపాధి పెంపుదల విధానాలను చేపట్టడం గురించి ఆలోచించాలి. ప్రధాన పెట్టుబడిదారీ దేశం అయిన అమెరికా ప్రభుత్వం-అలాంటి ప్రపంచ ప్రభుత్వాల ప్రతినిధిగా వ్యవహరించ గలిగినప్పటికి, కొన్ని విషయాల్లోనే ఆ పాత్ర నిర్వహిస్తోంది. అది, ప్రపంచ ప్రభుత్వంగా సాధ్యమైనంతవరకు ఉపాధి పెంపొందించే పాత్ర నిర్వహించడంలో ఒక జాతీయ ప్రభుత్వం కంటే ఎంత మాత్రం తక్కువ కాదు. అందువల్ల మొత్తం జాతీయ ప్రభుత్వాల బృందం కలిసి ఉపాధి పెంపుదల విషయంలో సంయుక్తంగా ప్రపంచ ప్రభుత్వ ప్రతినిధి పాత్ర నిర్వహించాలి.

అయినా కూడా, అలాంటి జాతీయ ప్రభుత్వాల బృందం ప్రపంచ ఉపాధి పెంపుదల కోసం ప్రేరేపించినా కూడా, అది ప్రపంచీకృత ద్రవ్య పెట్టుబడుల వ్యతిరేకతతో తలపడాల్సి ఉంటుంది. అంటే, ఇది పైన పేర్కొన్న మొదటి అవరోధం. జాతీయ ప్రభుత్వాల

దం చేపట్టే ఉపాధి విస్తరణ విధానాలు అమలులోకి రాకుండా ధించడానికి ప్రపంచీకృత ద్రవ్య పెట్టుబడులు తమ అన్ని ుధాలను వినియోగించడంలో ఆశ్చర్యం లేదు. వాటిలో ఒక నమైన ఆయుధం-తృతీయ ప్రపంచానికి 'ఉద్యోగాల ఎగుమతి' విషయంపై తన కేంద్రీయరణను మళ్ళించడం.

III

ఇప్పుడు మనం తృతీయ ప్రపంచ సమాజాల్లోని వివిధ వర్గాలపై ంచీకరణ ప్రభావాన్ని పరిశీలిద్దాం. అలాంటి ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యోల్బణం ఉపాధి అవకాశాలను తగ్గిస్తుంది, ముఖ్యంగా ణ రంగంలో. ఇలాంటి పరిస్థితి ఇండియాలో నయా ఉదారవాద ్కరణలు చేపట్టిన కాలంలో, అత్యధిక వృద్ధి జరిగిందన్న వాదనతో యం లేకుండా-ఏర్పడింది.

1993-04, 1999-2000 రెండు సంవత్సరాల మధ్యా స్ఎస్ నిర్వహించిన విస్తృత సమూనా సర్వే ప్రకారం-గ్రామీణ ధి పెరుగుదల, సంవత్సరానికి, కేవలం 0.58 శాతం మాత్రమే. ామీణ జనాభా పెరుగుదల కంటే చాలా తక్కువ. ఈ కాలంలో, ్లో పాల్గొనే వారి రేటు క్షీణించింది. కాని ఇది అత్యధిక ్యోగం వల్ల, శ్రామికులు నిరుత్సాహం చెందడం వల్ల వచ్చిన ంగా కావచ్చు. అంతకంటే ఇది-విద్యవంటి ప్రయోజనాల కోసం ర్థ్యంగల శ్రామికుల్ని నకారణంగా పనుల నుంచి ంహరించడం వల్ల ఏర్పడిన ప్రభావం కూడా కావచ్చు. అనేక అధ్యయనాలు కూడా గ్రామీణ ఉపాధిలో స్వల్ప పెరుగుదల ని పేర్కొన్నారు. అయితే అది ప్రస్తుత దినసరి నిరుద్యోగ ో చాలా పరిమితం. అలా జరిగితే జరిగి ఉండవచ్చు.

పెరుగుతున్న నిరుద్యోగం వల్ల గ్రామీణ జనాభాలో కొనుగోలు ంచడం జరుగుతుంది. 1990-91 నుంచి, ఆహారధాన్యాల దిగుబడిలో తరుగుదల వల్ల, తలసరి వినియోగం కూడా ఎక్కువ క్షీణించింది. అందువల్ల నేడు ఒక సాధారణ యుడి ఆహారధాన్యాల వినియోగ స్థాయి-రెండవ ప్రపంచయుద్ధ ాటి వినియోగస్థాయికి పడిపోయింది (యు.పట్నాయక్ 2004) ిగుబడి-వినియోగాల మధ్యతేడాను-అఖిల భారతస్థాయి ాలు కూడా చూపిస్తుంటే, అది గ్రామీణ భారతంలో ఇంకా గానే ఉంటుందని ఎవరైనా స్పష్టంగానే నిర్ధారణకు గుతున్నారు.

ిగుబడికి, వినియోగానికి మధ్యగల తేడాకు మరోవైపు ధాన్యాల భారీ నిల్వలు (ఇటీవలి కరువుకు ముందు దాదాపు లియన్ టన్నులు) ఉన్నాయి. అంతేకాక వాటిని ప్రపంచ ో కారుచౌక ధరలకు కుప్పలుగా పోస్తున్నారు, ఆకలితో నకనకలాడుతున్న జనాభా గల ఒక దేశానికి, కారుచౌక ధరలకు ఎగుమతులు చేపట్టడం అనే వైరుధ్యం ఒక్కటే-నయా ఉదారవాద విధానాలతో కలిసి, ప్రతి ద్రవ్యోల్బణం-చేసే ఏకైక సహాయం!

1990-91, 2003-04 ల మధ్య స్థూల జాతీయోత్పత్తిలో కేంద్ర ప్రభుత్వ వ్యయ నిష్పత్తి (బదిలీలు, రుణాలతో సహా) రుణ ద్రవ్య సంస్థల వ్యయం 20.54 శాతం నుంచి 17.41 శాతానికి తగ్గింది. ఇందుకు కారణం ప్రధానంగా స్థూల జాతీయోత్పత్తిలో పన్నుల ద్వారా రాబడి క్షీణించడం, అలాగే కొంతమేరకు స్థూల జాతీయోత్పత్తిలో ద్రవ్యలోటు నిష్పత్తి క్షీణించడం. మరొకటి, గ్రామీణాభివృద్ధి వ్యయంలో భారీ కోతలు విధించడం. 8వ ప్రణాళిక కాలంలో స్థూల జాతీయోత్పత్తిలో సగటున 14 శాతం ఉన్న గ్రామీణాభివృద్ధి వ్యయం, ఆ తర్వాత 6 శాతం కంటే తక్కువకు దిగింది.

తరచు ఒక వాదన ఇలా వినిపిస్తూంటుంది: 'గ్రామీణాభివృద్ధి వ్యయంలో చాలాభాగం గ్రామీణ పేదల ప్రయోజనాలకే ఉద్దేశించినప్పటికి, అది వాస్తవానికి గ్రామీణ ధనికుల చేతుల్లోకే పోతుంది. అందువల్ల ఆ మొత్తాల్లో తరుగుదల వల్ల పేదలపై పడే ప్రభావం తక్కువే!"-ఈ వాదన పొరపాటు. ప్రభుత్వ -గ్రామీణాభివృద్ధి వ్యయానికి గల బహుళాత్మక ప్రభావాలను ఈ వాదన పరిగణనలోకి తీసుకోవడం లేదు. ఆ వ్యయం గ్రామీణ ధనికుల చేతుల్లోకే చేరినా కూడా, దాని బహుళాత్మక ప్రభావం వల్ల గ్రామీణ పేదలకు కొంత ఉపాధి ఏర్పడుతుంది. తద్వారా వారికి కొంత పరోక్ష ప్రయోజనం లభించినట్టే. ఆ వ్యయం గ్రామీణ ధనికుల చేతుల్లోకి పోకుండా చూసి, పేదలకే చెందేలా చేయడం అవసరం. అలా జరగనప్పుడు కూడా, ఈ వ్యయాన్ని అస్సలు కేటాయించక పోవడం కంటే, కేటాయించడమే ఎంతో మంచిది. ప్రభుత్వ వ్యయంలో కోతలు-పారిశ్రామిక రంగం డిమాండ్ స్థాయిని కూడా ప్రభావితం చేస్తాయి. దిగుమతుల సరళీకరణతో బాటు, డిమాండ్ సంకోచ ప్రభావం అమల్లోకి వస్తుంది. అప్పటిదాకా దొరకని వివిధ రకాల విలాస వస్తువులకు అణచిపెట్టిన డిమాండ్‌ను, ఆంతరంగిక ఉత్పాదక సామర్థ్యాన్ని, సరళీకృత దిగుమతుల ద్వారా పెంచుకోవచ్చు. అలాంటి కోతలు పారిశ్రామిక స్తబ్దతను, మాంద్యాన్ని ముఖ్యంగా చిన్న తరహా పారిశ్రామిక రంగంలో త్వరితం చేస్తాయి. పారిశ్రామిక ఉపాధిపై విరుద్ధ ప్రభావం పడి, అదే సమయంలో 'సామాజిక వేతనాలు' కోతకు గురై, పారిశ్రామిక కార్మికుల్ని అడకత్తెరలోకి నెడతాయి. జౌళి, వస్త్రపరిశ్రమకు పురాతన కేంద్రాలయిన బాంబే, అహ్మదాబాద్‌ల వంటి నగరాలలో, ఇప్పుడు ఆపరిశ్రమలు అదృశ్యమవడానికి, లక్షలాది కార్మికులు ఉపాధి కోల్పోయి పూర్తిగా క్షీణించిపోవడం ఈ విస్తృత సాదృశ్యానికి కేవలం ఒక ఉదాహరణ మాత్రమే.

ఈ నయా ఉదారవాద ఆర్థిక విధానాలకు కేవలం ఒక్క సంప్రదాయ పెట్టీ బూర్జువా వర్గం, చిన్న పెట్టుబడిదారులు మాత్రమే కాదు, పట్టణ గ్రామీణ ప్రాంతాల కార్మికులు కూడా బలవుతున్నారు. ధనిక రైతులతో సహా మొత్తం రైతాంగం తీవ్ర ప్రతికూల పరిస్థితుల్లో పడిపోయింది. ఆ పరిస్థితులే ఇప్పుడు దేశ వ్యాప్తంగా జరుగుతున్న రైతుల ఆత్మహత్యల్లో ప్రతిబింబిస్తున్నాయి. గతంలో అనుసరించిన ప్రతి ద్రవ్యోల్బణ విధానాల ఫలితంగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో నెలకొన్న ప్రాపంచిక స్తబ్ధత అత్యవసర సరుకుల వాణిజ్యంలో, అలాగే ఉత్పత్తిలో ప్రతి ఫలిస్తోంది. ఏడాది ఏడాదికీ వాణిజ్య ఒప్పందాల్లో భారీ మార్పులు సంభవిస్తున్నాయి. అందువల్ల అత్యవసర సరుకులు, ముఖ్యంగా వ్యవసాయోత్పత్తులు తగ్గుతున్నాయి. అలాంటి క్షీణతకు, మరీ ఇటీవల సంభవించిన మరో అంశం కూడా తోడవుతుంది. అది, ఆర్థిక సరళీకృత ప్రక్రియలో ప్రవేశించిన తృతీయ ప్రపంచదేశాలలో వాస్తవ మారకపు రేట్ల ప్రాపంచిక క్షీణతను పెంచేందుకు కారణమవుతోంది. సంపన్న ప్రపంచంలో అయినా, లేదా తృతీయ ప్రపంచంలోనైనా సంపన్నులు తమ సంపదను తృతీయ ప్రపంచ దేశాల కరెన్సీలలో కలిగి ఉండడంలో భద్రత లేదని భావిస్తారు. తృతీయ ప్రపంచ ఆర్థిక వ్యవస్థ-తమ కరెన్సీని ఆకర్షణీయంగా మలచుకునేందుకు-ఏ మేరకు ప్రతి ద్రవ్యోల్బణాన్ని చేపట్టిందన్న విషయంలో-వారి నిర్ణయం మారదు. ఫలితంగా, స్వేచ్ఛా పెట్టుబడుల వెల్లువకు ఆర్థిక వ్యవస్థ తలుపులు తెరవడం సాధారణంగా- పెట్టుబడులకు గల తృతీయ ప్రపంచ కరెన్సీ విలువలో-ప్రాపంచిక స్తబ్దతకు దారితీస్తుంది. అది పెట్టుబడుల రూపంలో క్రమంగా దేశం దాటి వెళ్ళిపోతుంది. ఇంకా అది కూడా తగ్గి, కరెన్సీ రూపంలో సంపద కూడ బెట్టడం భద్రత కాదన్న విశ్వాసాన్ని కల్పిస్తుంది. స్పెక్యులేటివ్ పెట్టుబడుల రాక అనిశ్చితం కావడం, వాస్తవ మారకపు రేట్లలో హెచ్చు తగ్గులు రావడం-అనివార్యమై కరెన్సీ విలువను పెంచడం జరుగుతుంది. కాని ఆ హెచ్చు తగ్గుల వల్ల ప్రాపంచిక ధోరణి అధోముఖం పడుతుంది. అందువల్ల సరుకుల, ముఖ్యంగా అత్యవసర సరుకుల సాపేక్షిత విలువలు క్షీణించి, వాటి ఎగుమతులు పరిమితమవుతాయి. ద్రవ్య వేతనాలను స్థానిక కరెన్సీ ప్రకారం నిర్ణయించడం, ఉద్యోగ ఒప్పందాల్లో విరుద్ధ గమనానికి కారణమవుతుంది.

పైన పేర్కొన్నటువంటి అంశాల కారణంగా, ఇండియాలో రైతాంగానికి వ్యతిరేకంగా వాణిజ్య ఒప్పందాలను క్షీణింపచేయడం ద్వారా వాటిని నిరోధించడం జరుగుతుంది. ప్రభుత్వ సేకరణ విధానం, ప్రజా పంపిణీ విధానాల వల్ల అలాంటి పరిస్థితి కొంతకాలం ఏర్పడింది. కాని సరళీకరణ వల్ల ఆ విధానాలు ఆచరణలో పంటలు ఉన్నప్పటికీ, సరళీకరణ ద్వారా వ్యవసాయోత్పత్తులకు పెరిగిన ప్రాధాన్యత రీత్యా- ప్రపంచ ధరలు వినాశనకరంగా ఉన్నప్పటికి రైతులు ఆవైపే మొగ్గుతున్నారు. అదే సమయంలో నూతన ప్రతి ద్రవ్యోల్బణ పరిస్థితి కారణంగా, సబ్సిడీలపై కోత విధించడం వల్ల వ్యవసాయానికి అవసరమైన విద్యుత్, ఎరువుల వంటి వాటి ధరలు పెరిగిపోయాయి.

విదేశీబ్యాంకు (రైతాంగానికి అప్పులివ్వడానికి విముఖంగా ఉంటాయి)లను అనుమతించడం వల్ల, ఇప్పటిదాకా వ్యవసాయరంగం అనుభవిస్తున్న సంస్థాగత పరపతి సౌకర్యం అదృశ్యమైపోయింది. అలాగే దేశీయ జాతీయ బ్యాంకును కూడా సామాజిక బాధ్యతలపై కంటే, లాభార్జన పైననే దృష్టి సారించమని ఆదేశించడం జరిగింది. ఈ పరిస్థితుల ప్రాబల్యంలో చిక్కుకొని, ఘర్షణ లేకుండా బహుళజాతి విత్తన సంస్థలు-తమ విస్తృత గుత్తాధిపత్యంతో ప్రపంచ వాణిజ్య సంస్థ ప్రతిష్టించిన మేధోపర హక్కుల్ని సొంతం చేసుకుని-ప్రవేశించడంతో రైతాంగ గతంలో ఎన్నడూ లేని అణచివేతను ఎదుర్కొంటుంది. ఈ ప్రభావం ఇతర గ్రామీణ వర్గాల పైన కూడా, ముఖ్యంగా కార్మికుల పై పడుతుంది.

ఈ విధంగా ప్రజానీకంలో అత్యధిక భాగం నయా ఉదారవాద విధానాల దుష్ప్రభావాన్ని ఎదుర్కొంటుండగా, వడ్డీల మీద బతికే ఒక ప్రత్యేక దేశీయ వర్గం, వృత్తి నిపుణత సేవారంగాన్ని ఆక్రమించుకుని వర్ధిల్లుతున్నారు. ప్రభుత్వ ఆస్తుల్ని ఆక్రమించుకున్న పెట్టుబడిదారీ వర్గంలోని ఒక తరగతి, చిన్న ఉత్పత్తిదారుల పతనం ద్వారా లబ్ధిపొందిన పెద్ద పెట్టుబడిదారులు, విదేశీ సంస్థలకు- ప్రభుత్వాలకు చెందిన స్థానిక ఏజెంట్లు, ఉద్యోగులు, నిధులు ఇచ్చే ఏజన్సీలు, ఎన్‌జిఒలు, రాత్రి వ్యవహారాలు నడిపేవారు, స్పెక్యులేటర్లు, మధ్యవర్తులు-కొత్తగా ఏర్పడి, పెరిగిపోతున్న విదేశీ సంబంధాలను ఉపయోగించుకొని, 'ప్రపంచీకరణ' ద్వారా లబ్ధి పొందుతున్నారు. అనేకమంది ప్రయోజనాలకు, అతికొద్దిమంది ప్రయోజనాలకు మధ్య తప్పనిసరి అంతరాలు రెండు పొరపాటు దృక్పథాల వల్ల మరుగున పడిపోతున్నాయి. వాటిలో మొదటిది- భారత ఆర్థిక వ్యవస్థలో దారిద్ర్యం తగ్గుముఖం పడుతోందన్న అభిప్రాయం. ఈ అభిప్రాయం ఎన్.ఎస్.ఎస్ 55వ నివేదికలో సమర్పించిన వినియోగదారుల వ్యయ వివరాలవల్ల నెలకొన్నది. ఈ సమాచారం కలుషితమైనదని ప్రతిఒక్కరూ అంగీకరించినప్పటికీ, తగిన సవరణలు జరిగిన తర్వాత, దారిద్ర్యంలో క్షీణత సంశయ రహితమని అనేక మంది ఆర్థికవేత్తలు (ప్రపంచ బ్యాంక్ ఆశీర్వాదాలతో) వక్కాణిస్తున్నారు. ఆ సమాచారాన్ని జాగ్రత్తగా విశ్లేషించిన అనంతరం కొందరు స్వతంత్రమేధావులు (ఫిన్ 2004) ఈ వాదాన్ని సవాలు చేస్తున్నారు. ఆ సమాచారంలో దారిద్ర్య సమస్యపై ఎలాంటి నిర్ధారణకు రాలేమని వారు చెబుతున్నారు. ప్రస్తుత దారిద్ర అంచనాల విధానాన్ని ప్రశ్నించడమే మరింత

శక్తివంతమైన దాడి. దారిద్ర్యరేఖ ప్రమాణం కేవలం ష్టతాప్రమాణానికి (భారతదేశంలో దారిద్ర్యాన్ని నిర్వచించే ప్రధాన ధానం) ఒక ప్రత్యామ్నాయ విధానం మాత్రమే. కాబట్టి ఆ ష్టగ్రతను నిర్ధారించే సమాచారం నేరుగానే లభిస్తున్నందువల్ల, న్ ఎస్ ఎస్ వ్యయ సమాచారాన్ని బట్టి దారిద్ర నిష్పత్తిని అంచనా ం- దారిద్ర రేఖను పునర్‌నిర్ధారణ చెయ్యడంలో అర్థం లేదు. నేరుగా ష్టగ్రతా సమాచారం రీత్యానే ఆ ప్రమాణానికి దిగువన గల జనాభా తాన్ని లెక్కించవచ్చు. ఈ అభ్యాసం నిర్వహిస్తున్నప్పుడు దారిద్ర్యరేఖ ధాన ప్రాతిపదికపై లెక్కించిన శాతాన్ని దాటి ఎంతో తేడా పించడాన్ని ఇటీవలి సంవత్సరాలలో గుర్తించవచ్చు. వినియోగ, య ప్రాతిపదికపై దారిద్ర్యాన్ని అంచనావేసే ఏ లెక్కలయినా ర్తిగా తప్పే. వాస్తవానికి దారిద్ర్యం తగ్గడం కంటే అనంతర కాలంలో రిగింది.

రెండవ పొరపాటు దృక్పథం ఆహార వినియోగానికి ంబంధించినది. ఆహార ధాన్యాల భారీ నిల్వలు పోగుపడడానికి రణం-ప్రజల ఆహార అలవాట్లలో మార్పు రావడమని-అందువల్ల రు ఆహారధాన్యాలకు దూరమయ్యారని ఈ దృక్పథం వాదిస్తుంది. హారధాన్యాల నిల్వలు ప్రజాసమూహాల జీవన పరిస్థితులు ంచడాన్ని సూచిస్తుండగా, ఈ వాదన అందుకు విరుద్ధంగా, హారధాన్యాల నిల్వలు-ప్రజల జీవన ప్రమాణాలలో కొంత రుగుదలకు సూచనగానే పేర్కొంటోంది. వాస్తవానికి ప్రజలు రోభిన్నమైన వినియోగానికి కూడా నోచుకోవడం లేదు. తలసరి దాయాల్లో పెరుగుదలవల్ల, సమాజంలో తలసరి ఆహారధాన్యాల యోగం తగ్గిందన్న భావన పూర్తిగా తప్పు.

ప్రజల ఆహారధాన్యాల ప్రత్యక్షవినియోగం తగ్గడం నిజమైతే, పరోక్ష వినియోగం (ప్రాసెసింగ్ ఆహారానికి, మాంసాహార త్పత్తుల నిమిత్తం జంతువులకు అవసరమైన మేరకు) పెరగాలి. ప్రత్యక్ష, పరోక్ష వినియోగం వల్ల, తలసరి ఆహార ధాన్యాల యోగం పెరిగి, తలసరి ఆదాయాలతో బాటు-ప్రజల జీవన ాణాలలో పెరుగుదల కనిపిస్తుంది. ఆ విధంగా తలసరి ఆహార న్యాల వినియోగం-ప్రత్యక్ష, పరోక్ష వినియోగాలు కలిసి, గత యట్ యూనియన్‌లో సంవత్సరానికి ఒకటన్ను ఉండేది. ఇది రికా తలసరి వినియోగానికి దగ్గరగా ఉండగా, ఇతర సంపన్న ట్టుబడిదారీ దేశాలకు వినియోగం కంటే కొంచెమే తక్కువ.

ఈ విధంగా ఇండియాలో ఆహారధాన్యాల తలసరి వినియోగ త్తం క్షీణత కనిపిస్తే, అలాగే రోజువారీ కేలరీల వినియోగంలో త కూడా తోడయితే-దాని అర్థం జనాభా, ముఖ్యంగా గ్రామీణ భా అణచివేతకు గురవుతున్నారని నిర్ధారణ అవుతున్నది. అప్పుడు రయ్యే ప్రశ్న: ఆ అణచివేతను, ముఖ్యంగా ఆరోగ్యవంతమైన ప్రజా ప్రాతినిధ్య రాజకీయ వ్యవస్థగా నిర్వచించే సమాజంలో- ఎలా ఎదుర్కోవాలి?

## IV

అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడులు, తమ ప్రపంచాధిపత్యానికి సవాళ్ళు ఎదురైనపుడు, కాపాడుకోవడానికి కనీసం మూడు రక్షణ యంత్రాంగాలను రూపొందించుకుంది. మొదటిది ఇప్పటికే వివరించడం జరిగింది. అది, ఉత్తర దక్షిణ ప్రాంతాల శ్రామికుల మధ్య విభజన. ఇది ప్రపంచీకృత పెట్టుబడులకు వ్యతిరేకంగా, ప్రపంచ శ్రామికుల ఐక్యం కాకుండా చూడడమే కాదు, ఉత్తరాన కూడా ఆర్థిక రుగ్మతల కారణంగా ద్రవ్యపెట్టుబడుల ఆధిపత్యానికి ఎలాంటి సవాలూ-నిస్సహాయ, విస్తృత శ్రామికవర్గం నుంచి ఎదురు కాకుండా కూడా సంరక్షించుకుంటుంది. రెండవ రక్షణ గురించి కూడా ముందే సంక్షిప్తంగా పేర్కొనడం జరిగింది. నయా ఉదారవాద ప్రాబల్యం నుంచి వైదొలగడానికి అయ్యే అత్యంత భారీ మార్పిడి వ్యయాలను తట్టుకునే శక్తి ఏ దేశంలోని రాజకీయ వ్యవస్థకే లేదు.

పెట్టుబడుల ప్రవాహ అధికార శక్తిని ఒక రాజకీయ వ్యవస్థ ఎదుర్కొనడానికి, తగిన ప్రత్యామ్నాయ అజెండాతో ముందుకు వచ్చే అవకాశాలు కూడా లేవు. మారకపు విలువ పతనం మాంద్యానికి కారణమవుతోంది. (ఏ ప్రజల ప్రయోజనాల కోసం ప్రత్యామ్నాయ అజెండాను చేపట్ట వలసి వచ్చిందో వారికి మాంద్యం హాని చేస్తుంది) అలాగే దివాళా ప్రమాదం కూడా ఎదురవుతుంది. అందువల్ల, ఏ రాజకీయ వ్యవస్థ అయినా ప్రత్యామ్నాయ అజెండా చేపట్టే ధైర్యం చేయకుండా ఉండడానికి-ఇవి చాలు! అందువల్ల అలాంటి రాజకీయ వ్యవస్థలు కూడా సాధారణంగా సంస్కరణలకు అనుకూలత, అది కూడా విదేశీ పెట్టుబడిదారులకు వీలైనంత సానుకూలతతో ప్రకటించే వారి జాబితాలో చేరవలసి వస్తోంది.

అయినప్పటికి, కొన్ని సందర్భాలలో ఒక ప్రత్యామ్నాయ అజెండా అవలంబించే ఒక రాజకీయ వ్యవస్థ అనుకోకుండా అధికారంలోకి రావచ్చు. అలాంటి రాజకీయ వ్యవస్థ పెట్టుబడులపై తక్షణ నియంత్రణలు విధించే సాహసం చేసినా కూడా, అది వారసత్వంగా సంక్రమించిన విదేశీ రుణాలను చెల్లించాల్సిన పరిస్థితిని ఎదుర్కోవలసి వస్తుంది. అలాంటి భారాన్ని అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి, బెర్టన్ ఉడ్స్ సంస్థలు, సంపన్న దేశాల ప్రభుత్వాలు, ముఖ్యంగా సూపర్ సామ్రాజ్యవాది అమెరికాల 'సహకారం' లేకుండా- వదుల్చుకోడం అసాధ్యం. అయినా కూడా నూతన జాతీయ ప్రభుత్వం ఏక పక్షంగా రుణ మారిటోరియం ప్రకటించడం వంటి ఇతర చర్యలకు పాల్పడే సాహసం చేసినా, లేదా ఆ అప్పు తీర్చడానికి ముందుకు వచ్చినా కూడా- ఆ నూతన ప్రభుత్వానికి తీవ్ర ఆందోళన కరమైన పరిస్థితినే తెచ్చి పెడుతుంది.

అంతకంటే ఎక్కువగా, నయా ఉదారవాద విధానాల నుంచి మరలేందుకు ఎలాంటి ప్రయత్నం చేసినా-అలాంటి చర్యలకు ప్రతీకారం ఎదుర్కొనక తప్పదు. దాంతోబాటు నయా ఉదారవాదంలో స్వార్థ ప్రయోజనాలు గలవారి నుంచి వారి ప్రయోజనాల కోసం పనిచేసే మేధావుల నుంచి అలాగే, జాతీయ అంతర్జాతీయ మీడియా నుంచి (ప్రస్తుతం అవి ద్రవ్య పెట్టుబడులకు అతి సన్నిహితమయ్యాయి)-ప్రజల జీవన ప్రమాణాలు క్షీణించడం గురించి, (అందుకు కారణం సామ్రాజ్యవాద ప్రతీకార చర్యలే అయినా కూడా) 'ప్రభుత్వ ఆర్థిక విధానాల-విలేకరహిత 'సిద్ధాంతం' గురించి, మానవ హక్కుల ఉల్లంఘన గురించి, ఆశ్రిత పక్షపాతం ఉందంటూ అల్లిన కట్టుకథల గురించి, అవినీతి గురించి-విమర్శల పెడబొబ్బలు మొదలవుతాయి. అవి కొన్ని సందర్భాల్లో మంజూరులపై ఆంక్షలకు (భద్రతా సమితి దోషారోపణల ద్వారా) కారణమవుతాయి. ఇక ప్రతినిధుల ద్వారాగాని, లేదా నేరుగాగాని సాయుధ జోక్యం అంతిమ పరీక్ష అవుతుంది.

ఇక, మూడవ రక్షణ యంత్రాంగం-నయా ఉదారవాద విధానాల అమలువల్ల విధిగా ఏర్పడే త్రిముఖ అభివృద్ధి కారణంగా ఏర్పడే తృతీయ ప్రపంచ దేశాల మధ్య విభజన నుంచి-ఏర్పడుతుంది.

ప్రజల దారిద్ర్యం-వివిధ తరగతుల మధ్య ఒకరితో ఒకరు తరచు తీవ్ర ఘర్షణలకు తలపడే పరిస్థితులను సృష్టిస్తుంది. ఆఫ్రికాలోని అనేక ప్రాంతాల్లో అలాగే జరుగుతోంది. ఇందుకు సూడాన్ తాజా ఉదాహరణ.

ఈ తీవ్ర ఘర్షణల విషాద ఫలితం జీవనోపాధుల తగ్గుదల దీన్ని 'స్వేచ్ఛా' భిప్రాయాలు అని చెప్పుకుంటున్నవి-బాగా చిత్రీకరిస్తున్నాయి. (ముఖ్యంగా ఆ దేశం సామ్రాజ్యవాద ఖాతాదారు కానపుడు) రక్త పాతానికి దారితీసే రక్తపిపాసకు ఒక నిదర్శనమైన 'శ్వేత జాతీయుల బాధ్యత'కు ముగింపు పలకాలి.

అదేవిధంగా, నిరుద్యోగ పరిస్థితులు కూడా ప్రజల మధ్య కుల, ప్రాంతీయ, మత, జాతి వైషమ్యాల రోగపు కోపానికి వాహకంగా పనిచేస్తాయన్నది బాగా తెలిసిందే. అభివృద్ధి కోసం-విదేశీ పెట్టుబడుల వెల్లువపై ఆధారపడడం-ఏర్పాటు ధోరణులను పెంచుతుంది.

ఎవరికివారు మరిన్ని నిధులను తెచ్చుకోవడం వల్ల ప్రాంతీయా భివృద్ధి జరుగుతుందన్న నమ్మకం, ఆ ప్రక్రియలో ప్రజల మధ్య తీవ్ర వైషమ్యాలను నాటుతోంది. అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడుల ప్రాబల్యాన్ని పెంచుకపోవడానికి సహజంగానే అణగారిన ప్రజల్లోని వివిధ తరగతుల మధ్య వైషమ్యాలను పెంచే తీవ్ర ధోరణులను ప్రస్తుత ప్రపంచీకరణ యుగం పెంచుతోంది. ఈ విభజన వల్ల ఇంకా మరిన్ని అంతస్సూచనలు కనిపిస్తాయి. అవి: సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజలు ఐక్యం కాకుండా ఫాసిస్టు శక్తులు-అలాంటి విభజనలను ఉపయోగించుకొంటాయి. ప్రపంచ సమాజాలు-ముఖ్యంగా ఈ సరళీకరణ యుగంలో లౌకిక, ప్రజాస్వామ్య, సమ సమాజ శక్తులు ఒకవైపు, ఫాసిస్టు (సామ్రాజ్యవాదంతో కలిసి) ధోరణులు మరోవైపు ఘర్షణలకు తలపడే రణరంగాలుగా మారతాయి. మొదట్లో మత ఛాందసవాద శక్తులు- ముఖ్యంగా అరబ్ ప్రపంచం నేడు సామ్రాజ్యవాద వ్యతిరేక నినాదాలు ఇవ్వడం-అసాధారణంగానే కనిపిస్తుంది. కాని ఫాసిజాన్ని-మత ఛాందస వాదాన్ని ఒకటిగా పొరపడరాదు. పై విశ్లేషణలన్నీ ద్రవ్య పెట్టుబడులతో సాన్నిహిత్యం గలవే. ఇవన్నీ పేదలను విస్మరించే విధానాలను నిరాక్షేపణీయంగా సమ్మతించేవే. తమను వెలివేస్తున్న వ్యవస్థలపై ప్రజలు తిరగబడకుండా సహకరించేవే. అందుకు విరుద్ధంగా కొన్ని ప్రత్యేక రకాల మత ఛాందసవాదం నిస్సందేహంగా, చాలా కొత్త తరహా వాదనలు చేస్తున్నది.

విక్షేపమార్గాన్ని మార్చాలనుకొన్న వారిని-మార్పిడి వ్యయాల రీత్యా నీరసపడేలా నయా ఉదారవాదం పనిచేస్తున్నదని గమనించాము. ప్రజలు ఒక మార్పుకోసం ఓటు వేసినపుడు కూడా, అది వారిని ఇదే విక్షేప మార్గంలో కొనసాగించే వ్యూహాలు పన్నుతుంది. 'మానవతా ముఖంతో సంస్కరణలు" వంటి కొన్ని మినహాయింపుల్ని వారిపై విసురుతుంది. కాని వాటివల్ల సారాంశంలో మార్పు రాదు. ఇంకా అదనంగా, ఇకవేళ ఒక ప్రజాస్వామ్య ప్రభుత్వమే-ఒక నూతన మార్గాన్ని అనుసరించేందుకు తగిన సాహసంతో అధికారంలోకి వచ్చినా, అలాంటి ప్రభుత్వంపై ఫాసిస్టు శక్తులు ఎప్పుడూ విధ్వంసానికి దిగుతాయి.

క్లుప్తంగా చెప్పాలంటే, నయా ఉదారవాద విధానాలను చేపట్టడానికి, ప్రజాస్వామ్య సంస్థలను ప్రైవేటీకరించడానికి, ఒక ప్రధాన వైరుధ్యం ఉంది. ప్రస్తుతం ఇండియాలో-ప్రజలకు కొంత ఉపశమనాన్ని కల్పించి తీరాలనే నూతన ప్రభుత్వ సంకల్పం, ప్రపంచీకరణ అజెండాలో సంఘర్షిస్తున్న సన్నివేశం మన కళ్ళముందున్నది. ఈ ఘర్షణ-ఉపశమనాన్ని తిరస్కరించి, ప్రజల భ్రమలు తొలిగిపోవడానికి దారి తీయడం కూడా ఫాసిస్టు శక్తుల ప్రయోజనాలకు ఉపయోగపడుతుంది. జాతీయ ఫాసిజాన్ని ఎదుర్కొనడం, సామ్రాజ్యవాదంపై పోరాడడం కూడా ఈ ప్రణాళికలో భాగమే.

ఈ పోరాటాన్ని ముందుకు తీసుకు వెళ్ళడం అనేది, కేవలం ప్రజలను ఒక విస్తృత వేదికపై ఐక్యపరచడం ద్వారా మాత్రమే సాధ్యపడుతుంది. మార్పిడి వ్యయాలకు వారిని సిద్ధపరచడం, ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి మార్గాన్ని అవలంబించేందుకు చిత్త శుద్ధితో కృషి చేయడం ద్వారా ఈ పోరాటాన్ని ముందుకు తీసుకువెళ్ళాలి.



# విదేశీ పెట్టుబడులు-ప్రపంచీకరణ

-కె.ఎల్.మహేంద్ర
మాజీ అధ్యక్షులు, వరల్డ్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్‌యూనియన్స్

రెండు సంవత్సరాలక్రితం ప్రపంచ కార్మికసంఘాల సమాఖ్య (డబ్ల్యు ఎఫ్ టియు) ప్రతినిధి బృంధం చైనా దేశాన్ని సందర్శించింది. ఆ ప్రతినిధి బృందానికి, 'డబ్ల్యు ఎఫ్ టియు' అధ్యక్షుడిగా నేను నాయకత్వం వహించగా, ప్రధానకార్యదర్శి కామ్రేడ్ అలెగ్జాండర్ ఝరికోవ్, క్యూబా నుంచి డిప్యూటి ప్రధానకార్యదర్శి కామ్రేడ్ కొర్టోనా, అలాగే గ్రీస్, లెబనాన్‌ల నుంచి ఒక్కొక్కరు ఈ ప్రతినిధి బృందంలో సభ్యులుగా పాల్గొన్నారు. ప్రఖ్యాతి వహించిన చైనా గోడను, కొన్ని పరిశ్రమలు-తదితరాలను సందర్శించిన అనంతరం, చైనా కార్మిక సంఘాల అధ్యక్షుడితో సమావేశం ఏర్పాటు చేశారు. ఆయన చైనా కమ్యూనిస్ట్ పార్టీ పొలిట్‌బ్యూరో-స్టాండింగ్ కమిటి సభ్యుడు. అలాగే ఆ సమావేశంలో ప్రధానమంత్రి, రిపబ్లిక్ అధ్యక్షుడు-చైనా కమ్యూనిస్ట్‌పార్టీ ప్రధాన కార్యదర్శి కూడా పాల్గొన్నారు.

ప్రాథమిక చర్చల అనంతరం, విదేశీ పెట్టుబడులు (ఎఫ్‌డిఐ) సమకూర్చే బహుళజాతి సంస్థలు-విధానాల విషయంలో ఏవైనా ఆంక్షలు విధిస్తున్నాయా అనీ, అలాగే రెండవ ప్రశ్నగా-400 నుంచి 500 ఎకరాలదాకా భూమిని లీజుకివ్వడం గురించీ అడిగాను.

దక్షిణ కొరియా, హాంకాంగ్, తైవాన్, సింగపూర్, జపాన్, అమెరికాల నుంచి తమకు విదేశీ పెట్టుబడులు అందుతున్నాయనీ, వారెవరూ తమకు ఎలాంటి షరతులూ విధించరనీ ఆయన చెప్పారు. భూమి లీజు విషయం గురించి ఆయన చెబుతూ- పట్టణాల నగరాల జనాభా పెరుగుదల వల్ల ఆహార కొరత ఏర్పడినందున, ఆ సమస్యను పరిష్కరించేందుకు, మార్పిడి దశలో-భూమిని లీజుకివ్వడం జరిగిందనీ, కాని ఆ భూమి ప్రభుత్వ ఆస్తేనని చెప్పారు. తాము అభివృద్ధిపై కేంద్రీకరిస్తున్నామని చెప్పారు. మొత్తం చైనానంతటినీ ఒక్కసారిగా అభివృద్ధి చేయడం అసాధ్యమనీ, అందువల్ల ఒక ప్రాంతం తర్వాత మరో ప్రాంతాన్ని కాలక్రమేణా అభివృద్ధి చేయడం ద్వారా, మొత్తం చైనా నంతటినీ అభివృద్ధి పరచడం జరుగుతున్నదనీ చెప్పారు. అలాగే, అభివృద్ధి సాధించిన తర్వాతే, సోషలిజాన్ని నిర్మించడం సాధ్యపడుతుందని కూడా ఆయన చెప్పారు. చైనాకు విదేశాల నుంచి పెట్టుబడులేవీ వస్తున్నట్టు ఆయన చెప్పలేదు. ప్రముఖ మార్క్సిస్ట్ ఆర్థిక శాస్త్రవేత్త ప్రభాత్ పట్నాయక్ 'సోషల్ సైంటిస్ట్' లో రాసిన ఒక వ్యాసంలో ఇలా పేర్కొన్నారు.

"నూతన ప్రజాతంత్ర విప్లవం-ఒక ప్రముఖ సైద్ధాంతిక పరివర్తన. అది మార్క్సిస్ట్ చట్రం ద్వారా మూడవ ప్రపంచదేశాల సమీకరణను సాధ్యం చేసింది".

"సోషలిస్ట్ సమాజాన్ని నిర్మించే శక్తులు, తమ లక్ష్యానికి హాని కలగకుండా, ఎటువంటి రాజీ పడకుండా, పెట్టుబడిదారీ విస్తృతాభివృద్ధిని సృష్టించే తక్షణ లక్ష్యంతో-ఒక విప్లవాన్ని కొనసాగించే పరిస్థితిని అది సూచిస్తోంది".

ప్రజల తక్షణావసరాలను నెరవేర్చగలిగిన భారీ వస్తూత్పత్తిని-పారిశ్రామికాభివృద్ధి సాధించగలుగుతుందని మార్క్స్ చెప్పారు. అది ఇంకా, సమిష్టి ఉత్పత్తి విధానాన్ని సృష్టించడంతోబాటు, పారిశ్రామిక కార్మిక వర్గాన్ని కూడా ఉనికిలోకి తెస్తుంది. ఇదే విషయాన్ని, ఏంగెల్స్, 'సోషలిజం, శాస్త్రీయం, ఊహాజనితం' అన్న గ్రంధంలో విపులంగా చర్చించారు.

2004 సెప్టెంబర్ 5-11 న్యూఏజ్‌లో ప్రచురితమైన "సమకాలీన ప్రపంచీకరణకు అర్థం" అనే తన వ్యాసంలో పట్నాయక్ ఈ విధంగా పేర్కొన్నారు. 'అంతర్జాతీయ ఫైనాన్స్ క్యాపిటల్ తన రూపంలో ఏర్పడడం, అది తెచ్చిన ద్రవ్య ప్రపంచీకరణ-సమకాలీన సమాజ్యవాద దశలో అంతర్భాగమయ్యాయి.

ద్రవ్య ప్రపంచీకరణ ద్వారా-ప్రపంచం మొత్తం మీద ఆస్తుల్ని చౌకగా స్వాధీనం చేసుకోవడమే ఈ 'ఆర్థికీకరణ ప్రక్రియ' ఫలితం. (అందుకు భారీ బహుళజాతి సంస్థ 'ఎన్‌రాన్' కేసులో, దాని కార్యనిర్వాహకులు-స్పెక్యులేషన్ కార్యకలాపాల్లో కూరుకుపోవడం ఒక ఉదాహరణ).

తృతీయ ప్రపంచం గురించిన ఈ విశ్వాసం కొనసాగడానికి కారణం-పెట్టుబడుల అంతర్జాతీయ చలనశీలత, ఫలితంగా ఉత్తరాది నుంచి దక్షిణాదికి వలస రావడం, ఉత్పాదక సంస్థలను ఏర్పాటు చేయడం, ఆ తర్వాత ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో అసమాన అభివృద్ధికి కారణమవుతుందన్న వాదన!

ఇక్కడ పొరపాటు ఏమిటంటే, ద్రవ్య సహాయ చలన శీలతే, ఉత్పాదక పెట్టుబడి చలన శీలతగా అపోహపడడం! ఉత్తరాది దేశాల నుంచి దక్షిణాది దేశాలకు ఉత్పాదక పెట్టుబడులు రావడమనేది పూర్తిగా పరిమితం. (చైనా విషయంలో కూడా, ఉత్పాదక పెట్టుబడుల రాక విషయమై ప్రచారంలో ఉన్న విజయగాధలో కూడా, భారీ

పెట్టుబడులు విదేశాలనుంచి లభించినవే)

స్పెక్యులేటిక్ ఫైనాన్స్ పెట్టుబడి అత్యంత ప్రమాదకరమని పేర్కొనడం పూర్తిగా సమంజసం. ఇంకా, TRINITY ఆదేశాలమేరకు సాగే ప్రపంచీకరణ ద్వారా ప్రవహించే విదేశీ పెట్టుబడులు ఎల్లప్పుడూ ఉత్పాదక లక్ష్యాల కోసమే కాకపోవచ్చు. వాటికి మరికొన్ని ఇతర ప్రమాణాలుంటాయి. ఇంకా, ఈ విదేశీ పెట్టుబడులు-అభివృద్ధి చెందిన దేశాలకు మాత్రమే చేరతాయనేది వాస్తవం. కాని వాటిలో కొంతభాగమే అభివృద్ధి చెందుతున్న దేశాలకు కూడా అందుతాయి. ఈ నిర్ధారణలను అధ్యయనాల ద్వారా సేకరించిన గణాంకాలతో సరిచూడడం మంచిది. ఎన్‌రాన్ ఉదంతం, తప్పనిసరిగా ఫైనాన్స్ పెట్టుబడికీ ప్రాతినిధ్యం వహిస్తోంది. కాని మొత్తం అన్ని పెట్లుబడులనూ ఈ ఒకే ఉదాహరణనుబట్టి వర్గీకరించరాదు.

మారుతి, హీరోహోండా లేదా ఎచ్‌బి తదితర అనేక సంస్థలలో పెట్టుబడులన్నీ ఉత్పాదక పెట్టుబడులే. అదేవిధంగా బహుళజాతి సంస్థలు కూడా! స్వాధీనం చేసుకోవడానికి పెట్టిన పెట్టుబడులు-ఉదాహరణకి టాటా ఆయిల్ లేదా పార్లే డ్రింక్స్. అయినా కూడా, ఉత్పాదక పెట్టుబడిగా పెట్టుబడులు సమకూర్చడం అనేది జరుగుతోంది. స్పెక్యులేటివ్ ఫైనాన్స్ పెట్టుబడిగా ఎంత వస్తోంది, స్వాధీనం చేసుకొనేందుకు పెట్టిన పెట్టుబడుల ద్వారా ఎంత వస్తోంది, వ్యవసాయ ఉత్పాదక పెట్టుబడులుగా ఎంత అందుతున్నాయన్న విషయమై-ఒక సర్వే నిర్వహించడం మంచిది. చైనాకు లభిస్తున్న పెట్టుబడులు సముద్రాంతర పెట్టుబడులని రచయిత పేర్కొంటున్నారు. కాని చైనావారు కూడా నేడు అలా చెప్పడం లేదు. మరోరకమైన పరిస్థితిని వివరించేందుకు కొంత సమాచారం అందుబాటులో ఉంది. మొదటి విషయం, చైనాలో విదేశీ పెట్టుబడులు-మరే ఇతర దేశం కంటే ఎక్కువే. ఉదాహరణకి, 2002లో, అభివృద్ధి చెందిన దేశాలలో విదేశీ పెట్టుబడులు 460 బిలియన్ డాలర్లు కాగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో అది 162 బిలియన్ డాలర్లు. వాటిలో, మెయిన్‌లాండ్ చైనాలో 52 బిలియన్ డాలర్లు, హాంకాంగ్ చైనాలో 13 బిలియన్ డాలర్లు. అంటే మొత్తం 162 బిలియన్ డాలర్లలో అది 65 బిలియన్ డాలర్లు. కాగా ఇండియాలో విదేశీ పెట్టుబడులు 3 బిలియన్ డాలర్లు మాత్రమే. ఈ అంకెలు యుఎన్‌సిటిఎడి, 2003 ఇచ్చినవి. అదే నివేదిక ప్రకారం విదేశీ పెట్టుబడుల స్థూల స్థిర పెట్టుబడి శాతాలు 2000లో- చైనాలో 10.3 శాతం, హాంకాంగ్ లో 138.9 శాతం, ఇండియాలో 2.3 శాతం.

అదేవిధంగా, చైనా ఎఫ్‌టిఐ సంస్థ వెల్లడించిన సమాచారం ప్రకారం, చైనాకు అందిన విదేశీ పెట్టుబడులు- హాంకాంగ్ నుంచి 38.15 శాతం, జపాన్ నుంచి 7.18 శాతం, తైవాన్ నుంచి 65 శాతం, సింగపూర్ నుంచి 5.35 శాతం, కొరియానుంచి 3.7 శాతం, ఆఫ్రికా నుంచి 0.7 శాతం, యూరఫ్ నుంచి 11.72 శాతం, యుకె నుంచి 2.79 శాతం, లాటిన్ అమెకిరా నుంచి 11.36 శాతం, వర్జిన్ ఐలాండ్స్ నుంచి 9.46 శాతం, ఉత్తర అమెరికా నుంచి 11.77 శాతం, అమెరికా నుంచి 10.79 శాతం, ఒస్సానియా నుంచి 1.71 శాతం- మొత్తం 40 బిలియన్ డాలర్లు.

ఈ పెట్టుబడులన్నీ సముద్రాంతరాలనుంచి వచ్చే విదేశీ పెట్టుబడులే అన్న వాదనను కొట్టివేయకుండా ఉండాలంటే, అందుకు తగిన ఆధారాలను సమకూర్చాల్సి ఉంటుంది. సోవియట్ యూనియన్‌లో జాతుల సమస్య పరిష్కారమయిందని సిపిఐ గతంలో విశ్వసించింది. కాని సోవియట్ యూనియన్ పతనం తర్వాత అది తప్పు అని తేలింది. భారతదేశానికి విదేశీ పెట్టుబడులు రిజర్వ్‌బ్యాంక్ లెక్కల ప్రకారం 1998-99లో ఈ విధంగా ఉన్నాయి.

మారిషస్ 39.50%, అమెరికా 22.64 శాతం, జపాన్ 11.76 శాతం, ఇటలీ 5.78 శాతం, జర్మనీ 5.68 శాతం, దక్షిణకొరియా 4.25 శాతం, నెదర్‌లాండ్ 2.67 శాతం, ఇతర దేశాలు 17.27 శాతం.

**హాంకాంగ్, మారిషస్:**

హాంకాంగ్ ఫైనాన్స్ కంపెనీల సమాచారం ప్రకారమే ఎవరైనా ఈ అంశాన్ని అధ్యయనం చేయాలి. అది ఒక బ్రిటీష్ వలస. అక్కడివి-చైనీయుల యాజమాన్యంలో ఉన్న కంపెనీలా, లేక బ్రిటీష్ పెట్టుబడులలో సంయుక్త రంగంలో ఉన్నవా? వాటిలో విదేశీ పెట్టుబడులు ఎంత? ఎందుకంటే, ఒక్క సంవత్సరంలో విదేశీ పెట్టుబడులు 13 బిలియన్ డాలర్లని తెలుసుకున్నాం. ఇంకా విదేశీ పెట్టుబడుల శాతం స్థిరమూల ధనంలోనే అధికంగా ఉంది.

1998నాటి యుఎన్‌సిటిఎడి నివేదిక ప్రకారం, అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మొట్టమొదటి 50 బహుళజాతి కంపెనీల్లో ఆరు మెయిన్‌లాండ్ చైనావి, 9 హాంకాంగ్‌వి, చైనా ప్రాంతమైన తైవాన్‌వి రెండు. అంటే మొత్తం 17. ఇండియావి కేవలం రెండే! అవి-రిలయన్స్, ఒన్‌జిసిలు!

అలాగే మారిషస్ గురించి కూడా ఒక అధ్యయనం జరగాలి. అక్కడ నుంచి వచ్చే విదేశీ పెట్టుబడులు ఇండియాలోనే అధికం. అంటే ఇండియాలోని కొన్ని కంపెనీలు తమ నల్లధనాన్ని అక్కడ డిపాజిట్ చేసుకున్నాయా? లేదా అక్కడ ఇండియన్ కంపెనీలు ఆదా చేసుకున్న సంపద పోగుపడిందా? లేక కొన్ని ఇతర కంపెనీల నుంచి విదేశీ పెట్టుబడులు వస్తున్నాయా?

విదేశీ ఉద్యోగావకాశాలో ముఖ్యంగా సమాచార సాంకేతిక రంగంలో- శ్రామికులకు శ్రామికులకు మధ్య వ్యతిరేకతను

సృష్టిస్తున్నాయన్న అభిప్రాయాన్ని అవ్యాసం కలిగిస్తోంది. అవును, అమెరికాలో నిరుద్యోగానికి కారణం-అభివృద్ధి చెందుతున్న దేశాలకు పెట్టుబడులు తరలించడం, విదేశీయులకు తమ దేశంలో ఉద్యోగాలు కల్పించడమేనని, ఎఎఫ్ఎల్, ఇఐఒలు అమెరికాలో ప్రచారం చేస్తున్నాయి.

కాని వాస్తవం ఏమిటంటే, గత మూడు సంవత్సరాలుగా 2.7 మిలియన్ల ఉద్యోగాలు పోయాయి. విదేశీయులకు ఉద్యోగాలు కల్పించడం వల్ల పోయిన ఉద్యోగాలు 300,000 మాత్రమే. ఉత్పాదకతలో ఒక్కశాతం పెరుగుదల వల్ల 1.3 మిలియన్ ఉద్యోగాలు కోల్పోవడం జరుగుతోందని అంచనా. కార్మికులు త్రిమూర్తులు నిర్దేశించే నయా ఉదారవాద విధానాలకు వ్యతిరేకంగా తిరగబడేబదులు, వారు అభివృద్ధి చెందుతున్న దేశాల కార్మికులకు వ్యతిరేకంగా తిరగబడుతున్నారు. నయా ఉదారవాద విధానాలు ప్రపంచ వ్యాప్తంగా అత్యధిక నిరుద్యోగానికి, దారిద్ర్యానికి దారితీస్తున్నాయి. అవి పేద, బలహీన దేశాలలో పలా, ఆయా దేశాల మధ్య కూడా అగాధాలను పెంచుతున్నాయి. ఈ విధానాలు శ్రామిక వర్గ హక్కులపైనా, సామాజిక భద్రతా ప్రణాళికలపైనా దాడి చేస్తున్నాయి. ప్రపంచవ్యాప్తంగా గల శ్రామికులు పెట్టుబడిదారీ ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ప్రజానీకంలోని ఇతర ప్రజాతంత్ర శక్తులతో కలిసి పోరాడాలి. ఈ కృషిలో శ్రామికులు విఫలమయితే, మతతత్వం, నియంతృత్వం, ప్రాంతీయ విభేధాలు, ఇంకా అనేక అవాంతరాలు పెరిగిపోతాయి.

**రుణాలు, లేక విదేశీ పెట్టుబడులు:**

పాశ్చాత్యదేశాలలో పెట్టుబడి పోగుపడడం అనేది ప్రధానంగా సముద్రాలను, వలసలను దోచుకోవడంవల్ల జరిగింది.

వలసలు లేదా పాక్షిక వలసలు అయిన అభివృద్ధి చెందే దేశాలకు సంపదను పోగుచేసుకోవడం కష్టం. భూసంస్కరణలు-మార్కెట్‌ను సృష్టించగలుగుతాయి. కాని అవి పూర్తిగా అమలు కావడం లేదు. పెట్టుబడిపోగుపడడం మందకొడిగా సాగుతోంది. అందువల్ల ఇండియా ప్రపంచబ్యాంకు, ఆసియా అభివృద్ధి బ్యాంకుల నుంచి రుణాల ద్వారా అలాగే అంతర్గతంగా బాండ్లు విడుదల చేయడం ద్వారా, ఎగుమతులకు చెల్లించవలసిన-రూపాయల్లో చెల్లించి యంత్రాలను తెచ్చుకుంటోంది.

ప్రపంచబ్యాంకు నుంచి మంజూరయ్యే రుణాలు-ఎప్పుడూ ప్రభుత్వరంగ ప్రైవేటీకరణ, సబ్సిడీలరద్దు, స్వేచ్ఛామార్కెట్ ఆర్థిక వ్యవస్థ, వ్యవస్థాగత సర్దుబాట్లు మొదలైన షరతుల మీద మంజూరవుతాయి. టారిఫ్‌లను తొలగించడం, సరకుల స్వేచ్ఛా చలనార్థ అనుమతించడం ప్రపంచవాణిజ్య సంస్థకు అవసరం. కాని, అమెరికా, యూరోపియన్ యూనియన్‌లు తమ వ్యవసాయానికి, ఎగుమతి ఉత్పత్తులకు 60 శాతం నుంచి వంద శాతం దాకా సబ్సిడీలు సమకూరుస్తున్నాయి. అమెరికా అనేక రక్షణలు కల్పించుకునే దేశమే అయినా, అభివృద్ధి చెందుతున్న దేశాల మార్కెట్లు మాత్రం తమకు స్వేచ్ఛగా అందుబాటులో ఉండాలని కోరుకుంటుంది. ఇంకా, బడ్జెట్‌లోటు ఉండరాదు. ఆర్థికమాంద్యాన్ని నియంత్రించాలి. అంతేకాదు మేధోసంపదకు సంబంధించిన హక్కులు కూడా ఉంటాయి. ఒక ఉత్పత్తిపై పేటెంట్ హక్కులు తీసుకుంటే ఇక మరేదేశమూ ఆ ఉత్పత్తిని చేపట్టరాదు. కనీసం వేరే ప్రక్రియల ద్వారా అయినసరే! ఈ విధానాలన్నీ బహుళజాతి కంపెనీల వాటి స్వదేశాల ప్రయోజనాలను కాపాడేందుకు ఉద్దేశించినవే.

మనదేశ బడ్జెట్‌లో అధికభాగం, రుణాల చెల్లింపులకు వడ్డీలకు, రక్షణకు, ఉద్యోగుల జీతాలకు ప్రత్యేకంగా కేటాయించి పెట్టడం జరుగుతోంది. ఉన్నతాధికారుల జీతాలు ఒకే తడవుగా పెరిగిపోతున్నాయి. అది కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల ఆందోళనలకు కారణమవడమేకాక, రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ఆ ప్రకారం జీతాలు పెంచవలసివస్తోంది. ఆ విధంగా చివరికి బడ్జెట్‌లో మిగిలేది అతిస్వల్పం.

పెట్టుబడి సమకూరడం చాలా మందకొడిగా సాగుతోంది. స్థూల జాతీయోత్పత్తికి పన్నుల నిష్పత్తి అనుగుణంగా కాక చాలా తక్కువగా ఉంది. వ్యవసాయ ఆదాయంపై పన్ను విధించడం లేదు. కార్పొరేట్ రంగానికి కమీషన్లు లభిస్తున్నాయి. ద్రాక్ష, ధాన్యం మొదలైన పంటలకోసం అనేక మంచి పారిశ్రామికవేత్తలు ఫాంలను ప్రారంభించారు. ఆ విధంగా వారు తమ నల్లధనాన్ని తెల్లధనంగా మార్చుకోవడం జరుగుతోంది. అలాంటి పరిస్థితిలో, విదేశీ పెట్టుబడులకోసం మొగ్గుచూపడం జరుగుతోంది. ఎఫ్.ఐ.ఐ-లేదా స్పెక్యులేటివ్ పెట్టుబడి రాకవల్ల ఉపయోగంలేక పోవడమే కాక, అవి ఆగిపోతే మాత్రం సంక్షోభానికి దారితీస్తుంది.

సమూల మార్పిడికి తూర్పు ఆసియా దేశాలు, అర్జెంటైనా, మెక్సికో మొదలైన దేశాల దొరికాయి. విదేశీ స్పెక్యులేటర్లు మరింత ఉపసంహరించడం మొదలుపెట్టగానే, స్థానిక వ్యాపారులు తమ ధనాన్ని డాలర్లలోకి మార్చుకొంటారు. అది ఆర్థిక సంక్షోభానికి దారి తీస్తుంది. బ్రెజిల్, మెక్సికో, తూర్పు ఆసియాదేశాలు, రష్యా, అర్జెంటైనా మొదలైన దేశాలలో ఆర్థిక సంక్షోభం నెలకొంది. కాని విదేశీ

(మిగతాది 17వ పేజీలో)

# విదేశీ ప్రైవేటు పెట్టుబడి

-తరిమెల నాగిరెడ్డి

(విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను భారత ప్రభుత్వం రెండు చేతుల్తో ఆహ్వానిస్తోంది. ఈ ఆహ్వానం 1991 ఆర్థిక సంస్కరణల తర్వాత పలుకుతున్న ఆహ్వానమేమీ కాదు. నెహ్రూనాటి నుంచే ఇది కొనసాగుతున్నది. ఈ విషయం గురించి ఎపుడో ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు తరిమెల నాగిరెడ్డి హెచ్చరించారు. అందులో ఒక భాగాన్ని ఇక్కడ ప్రచురిస్తున్నాం.-నం)

విదేశీ పెట్టుబడిని జాతీయం చేసేది లేదని భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఎపుడో 1948లోనే విదేశీ పెట్టుబడిదారులకు హామీనిచ్చాడు. "విదేశీ పెట్టుబడికి పూర్తి స్వేచ్ఛనివ్వడం" ప్రభుత్వం ప్రకటించిన విధానమని మనం ఇదివరకే గమనించాలి.

రెండో ప్రపంచ యుద్ధానంతరం కాలంలో, ప్రపంచ శక్తుల బలాబలాల్లో మార్పులు రావడంతో సామ్రాజ్యవాదం దేశాల ఆర్థిక వ్యవస్థని 'కనపడని' వలసలను ఆక్రమించి పాలించే రూపంలో కాక రుణాలు, గ్రాంట్లు, ప్రయివేటు పెట్టుబడి మదుపు వంటి వివిధ ముసుగులతో పెట్టుబడి దురాక్రమణ రూపంలో సాగుతోంది. అందువల్ల సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడి చొరబాటూ, పెరుగుదలల గురించి నిర్దిష్టంగా అధ్యయనం చేయడం జాతీయవాదులు, విప్లవకారులందరికీ ముఖ్య అవసరమూ, కర్తవ్యం కూడా. దేశ ఆర్థిక రాజకీయాభివృద్ధికై విదేశీ ఫైనాన్స్ పెట్టుబడి పట్టును అర్థం చేసుకోవడానికిది అవసరం.

**లెనిన్ చాలాకాలం క్రిందటే ఇలా చెప్పారు:**

..."ఫైనాన్స్ పెట్టుబడి అన్ని ఆర్థిక, అంతర్జాతీయ సంబంధాలలోను ఎంతో గొప్ప శక్తి. అది నిర్ణయాత్మక శక్తి అని చెప్పవచ్చును. పూర్తి రాజకీయ స్వాతంత్రాన్ని అనుభవిస్తున్న రాజ్యాలను సైతం తన అధీనం చేసుకోగల-నిజానికి అలా చేసుకొంటున్న శక్తి ఇది."

"పరాధీనతలో అనేకరకాల రూపాలు కూడా వున్నాయి. రాజకీయంగా స్వతంత్రంగా ఉండి కూడా నిజానికి ఆర్థిక వనరుల రీత్యా, దౌత్యరీత్యా పరాధీనత వలలో చిక్కుపడిపోయిన దేశాలున్నాయి." అని కూడా లెనిన్ విశ్లేషించి నిరూపించారు.

విదేశీ ఆధిపత్యపు పరిణామాలు ఎలా ఉంటాయి అన్న విషయంలో భారతీయ ఆర్థిక శాస్త్రవేత్త రెనడే అభిప్రాయాలు చాలా స్పష్టంగా ఉన్నాయి. "ఒకే దేశంపై మరొక దేశపు రాజకీయ పెత్తనం అందరి దృష్టినీ ఆకర్షిస్తుంది. కానీ దీనికన్నా శక్తివంతమైన ఆధిపత్యం ఏమిటంటే ఒక దేశపు పెట్టుబడీ, వ్యాపారమూ, నైపుణ్యమూ మరొకదేశపు వాణిజ్యం, ఉత్పత్తులపై చలాయించే ఆధిపత్యం; అయితే దీనిని ఎవరూ పట్టించుకోరు. ఈ రెండవ రకపు ఆధిపత్యం చాపక్రింద నీరు వంటిది. ఇది జాతి జీవితాన్ని రూపొందించే అన్నరకాల కార్యకలాపాలను స్తంభింప జేస్తుంది.

(గ్రోత్ ఆఫ్ ఇండస్ట్రీస్ ఇన్ ఇండియా-పేజి 87)

అన్ని వర్గాల ప్రజలలోనూ తీవ్రమవుతున్న వ్యతిరేకత కారణంగా ప్రత్యక్ష "వలన పద్ధతి" లో రాజకీయంగా, ఆర్థికంగా లొంగదీసుకోవడం అసాధ్యమైనపుడు సామ్రాజ్యవాదం దేశాలను లొంగదీసుకోవడానికి ఎల్లపుడూ నూతన పద్ధతులను అనుసరిస్తుంది. భారతదేశం దీనికి మినహాయింపేమీ కాదు.

విదేశీ గుత్తాధిపతుల ప్రత్యక్ష పెట్టుబడి సామ్రాజ్యవాద చొరబాటుకు ముఖ్యమైన సాధనాలలో ఒకటి. మనదేశ ఆర్థిక వ్యవస్థలోకి విదేశీ ప్రయివేటు పెట్టుబడి చొరబాటు గురించీ మన ఆర్థిక వ్యవస్థలోని నిర్మాణయుత ఉత్పత్తి రంగంలో దాని సంబంధం గురించీ వాస్తవాలను నగ్నంగా బైటపెట్టడం ఇపుడు నా ఉద్దేశం. మన ఉత్పత్తి వ్యవస్థమీద విదేశీ ఫైనాన్సు పెట్టుబడి భల్లూకం పట్టునీ దాని పెరుగుదలనీ తక్కువ అంచనా వేసే ఒక బలమైన ధోరణి పెరగడం దురదృష్టకరం.

ఈ అధ్యయనానికి కొన్ని పరిమితులున్నాయి. బహుళ ప్రచారం పొందిన తన గ్రంథం "ఫారిన్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఇన్ ఇండియా"లో నిశితమైన విశ్లేషణ చూస్తూ క్రిడాన్ అన్నట్లుగా:

"స్వాతంత్ర్యానంతరం అధికారయుతంగా వెలువరిస్తున్న గణాంక వివరాల ఉత్పత్తి విపరీతంగా పెరిగిపోయింది. అయినప్పటికీ, విదేశీ పెట్టుబడుల సరిహద్దు రేఖల్ని గుర్తించడం ఇంకా కష్టంగానే ఉంది. అధికారిక గణాంక వివరాలు పరస్పర విరుద్ధంగా ఉంటున్నాయి. విదేశీ పెట్టుబడులను గణాంక వివరాలలోను చట్టంలోను కూడా సాధారణంగా 'జాతీయమైనవి'గా పరిగణించే ప్రభుత్వ విధానం వలనే ప్రధానంగా ఇబ్బంది ఎదురవుతోంది. ఏవో కొన్నింటి విషయంలో తప్ప విదేశీ పెట్టుబడులు పూర్తి భారతీయ పెట్టుబడుల నుంచి వేరేచేసి గుర్తించ వీలులేని విధంగా ఉన్నాయి.. విదేశీ వ్యక్తిగత పెట్టుబడిదారులు, సంస్థల రూపురేఖలు శక్తివంతంగా మరుగుపరచబడ్డాయి."

(పేజీ-185)

అధికారిక వివరాలలో "బ్యాంకింగ్ పెట్టుబడి చేర్చబడలేదు" అలాగే నిర్మాణ రంగంలో పెట్టిన పెట్టుబడి పేమెంట్ల రూపంలో పెరుగుతున్న పెట్టుబడులు, రాయల్టీ చెల్లింపుల మొత్తాలు కూడా చేర్చబడలేదు. విదేశీయుల స్వంతమైన (Owned) నిధులు ప్రవేటు రుణాలు చేర్చబడ్డాయి. 1953 నుంచి గత పదేళ్ళ కాలంలో కొన్ని కీలక ఆర్థిక సంబంధాలు సాపేక్షికంగా స్థిరంగా ఉన్నాయని మనం భావించినట్లయితే ఆ లెక్కన 1961లో విదేశీ కంట్రోలులోని ఆస్తుల మొత్తం రూ. 1400 కోట్లకు పైగా ఉండవచ్చును."

(పేజీ-186)

రజనీ పామీదత్తు తన "క్రైసిస్ ఆఫ్ బ్రిటన్ అండ్ బ్రిటీష్ ఎంపైర్" అనే రచనలో భారతదేశంలోకి చొరబడేందుకు అమెరికన్ పెట్టుబడి తీసుకొంటున్న అంతకంతకూ చురుకైన చర్యల గురించి వ్రాస్తూ "అమెరికన్ పెట్టుబడి తరచుగా నామమాత్రమైన ఫ్రెంచి, బెల్జియం లేదా భారతీయ యాజమాన్యం క్రింద మరుగు పరచబడుతోంది. దీని వలన అధికార సమాచారంలో అసలు పరిస్థితి బయటపడదు." అని వ్యాఖ్యానించాడు.

(పేజీ-167)

భారతదేశంలో సామ్రాజ్యవాద దోపిడీ గురించి ప్రజలకు తెలియకుండా దాచి ఉంచుతున్న ప్రభుత్వం యొక్క ఈ దుర్మార్గమైన వైఖరి విప్లవకారులనేమి ఆశ్చర్యపరచదు. విదేశీ గుత్త పెట్టుబడుల పట్ల భారత ప్రభుత్వపు బానిసబుద్ధిని మాత్రమే ఇది సూచిస్తున్నది.

**అనువైన వాతావరణ సృష్టి**

విదేశీ పెట్టుబడిదారుల, వారికి ఒదిగి ఉండే స్వదేశీ మిలాఖత్‌దారుల అవసరాల పట్ల భారత ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహిస్తోంది. విదేశీ పెట్టుబడి దేశంలో నిరాఘాటంగా చొరబడటానికి వీలుగా వారి కోర్కెలకు, అవసరాలకు అనుగుణమైన వాతావరణాన్ని సృష్టించడానికి భారత ప్రభుత్వం మొదటి నుంచీ అనేక చర్యలు తీసుకొని మార్గాన్ని సుగమం చేసింది. శ్రీ ఎల్‌డ్రిడ్జ్ చెప్పినట్లుగా "భారతదేశం క్రమక్రమంగా విదేశీ పెట్టుబడికి అవకాశాలను మెరుగుపరిచింది. ఒక అనుకూల వాతావరణాన్ని ఏర్పరిచింది"

(పాలిటిక్స్ ఆఫ్ ఫారిన్ ఎయిడ్-పేజి 154)

1956లో రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభోత్సవ సందర్భంగా పార్లమెంటు ఆమోదించిన పారిశ్రామిక విధాన తీర్మానానికి కూడా తిలోదకాలిచ్చారు. షెడ్యూలు A, B ల నుండి మినహాయింపులు సర్వసాధారణమైపోయాయి. చమురు పరిశోధన, ఉక్కు కొలుములు, ఎరువులు, గనుల త్రవ్వకం, ఇంకా అనేక రంగాలలో విదేశీ ప్రయోజనాలకి అవకాశం కల్పించే విధంగా మినహాయింపులు ఇచ్చారు. ప్రభుత్వరంగ పరిశ్రమలలో సైతం ప్రత్యేకించి పెట్రోలియమ్ పరిశ్రమలో విదేశీ పెట్టుబడికి గేట్లు తెరిచారు.

ఈ విధమైన అనుకూల వాతావరణాన్ని ఏర్పరచడంలో మరొక ముఖ్యమైన అంశం-భారత పారిశ్రామిక ద్రవ్యసహాయక సంస్థ (ఐ.యఫ్.సి.ఐ), భారత పారిశ్రామిక పరపతి పెట్టుబడుల సంస్థ (ఐ.సి.ఐ.సి.ఐ), రాష్ట్రాల ద్రవ్యసంస్థలు, చివరికి జీవితభీమా సంస్థలాంటి ద్రవ్యసహాయ సంస్థలను పెక్కింటిని భారత ప్రభుత్వం స్థాపించింది. నేషనల్ ఆర్గానిక్ కెమికల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ (యన్.ఒ.సి.ఐ.యల్), ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ (ఐ.సి.ఐ) వారి కాన్పూరు ఎరువుల కర్మాగారం లాంటి విదేశీ ఆధిపత్యం క్రింద ఉన్న అనేక పరిశ్రమలను భారతదేశంలో నెలకొల్పడానికి ఇలాంటి సంస్థలన్నీ సహాయం చేస్తున్నాయి.

కిడ్రాన్ తన గ్రంథంలో వ్రాసినట్లుగా విదేశీ సంస్థలు చౌకగా ద్రవ్య సహాయం పొందేందుకు మొత్తం మీద సౌలభ్యం కల్పించబడింది. సుస్థాపితమైన పెద్ద సంస్థల పట్ల ప్రముఖ పరపతి సంస్థలు చూపే పక్షపాతం వలన అవి సహజంగానే ప్రయోజనం పొందుతున్నాయి. ఇంకా ఎగుమతులను ప్రోత్సహించడం కోసం

ఆయా దేశాలలోని ప్రభుత్వాలు ఏర్పాటు చేసిన లేదా మద్దతు ఇచ్చిన ప్రత్యేక రుణనిధులను కూడా తేలికగా పొందగలుగుతాయి. బ్రిటన్‌కి చెందిన ఎక్స్‌పోర్ట్సు క్రెడిట్స్ గ్యారంటీ డిపార్టుమెంటు మరియు కామన్వెల్తు డెవలప్‌మెంటు ఫైనాన్స్ కంపెనీ; అమెరికాకి చెందిన ఎక్స్‌పోర్టు ఇంపోర్టు బ్యాంకు మరియు డెవలప్‌మెంటు లోన్ ఫండ్; పశ్చిమ జర్మనీకి చెందిన క్రెడిటాన్ స్టాల్ట్‌ఫుర్ విడెరాన్‌బాన్, హెర్మస్ వెర్సీ షెరంగ్ ఎ.జి. మరియు డూట్స్ రివిజన్ ఉండ్ ట్రి హాండ్ ఎ.జి; ఫ్రాన్స్‌కి చెందిన కంపాజ్ని డి అష్యూరెన్స్ ఫర్ లా కామర్స్ ఎక్స్టెర్యూర్ అలాగే పెట్టుబడిని ఎగుమతి చేస్తున్న అన్ని దేశాలలోను ఉన్న ఈ విధమైన సంస్థలు ఆయాదేశాలు స్థాపించిన లేదా మద్దతునిచ్చిన ప్రత్యేకరుణ నిధుల సంస్థలే. ప్రాథమికంగా తమదేశాల ఎగుమతులను ప్రోత్సహించడం కోసం సిద్ధం చేయబడినవే అయినప్పటికీ ఈ సంస్థలు తరచుగా విదేశాలలో తమ దేశీయ సంస్థలకు హెచ్చు ప్రాధాన్యత ఉండే విధంగా మధ్యంతర, దీర్ఘకాలిక పెట్టుబడులకు ద్రవ్యసహాయం చేస్తున్నవి.

(పేజి 231)

విదేశీ పెట్టుబడిని మనదేశంలోకి ఆకర్షించేందుకు భారత ప్రభుత్వం యొక్క చురుకైన సహకారం, ఆశీర్వాదంతో న్యూఢిల్లీ, న్యూయార్క్, డీసల్‌డార్ఫ్ పట్టణాలలో "భారతీయ పెట్టుబడి కేంద్రాలు" స్థాపించబడ్డాయి. విదేశీ వాణిజ్యవేత్తలకు భారతీయ వాణిజ్యవేత్తలకు మధ్య సమాచార కేంద్రంగా, వారిమధ్య సంబంధాలను నెలకొల్పే సంస్థగా, సలహా సంస్థగా ఇది పనిచేస్తుంది. శ్రీ పి.జె ఎల్‌డ్రిజ్ మాటలలో చెప్పాలంటే "పెళ్ళిళ్ళు కుదిర్చే సంస్థ" లక్షణాలు దీనికి ఎక్కువగా ఉన్నాయి.

(పేజి-154)

అనేక సంవత్సరాలుగా వివిధ పన్నుల రాయితీలలాంటి ప్రత్యేక ప్రోత్సాహాలను అంతకంతకూ ఎక్కువ సంఖ్యలో భారత ప్రభుత్వం విదేశీ పెట్టుబడిదారులకు కల్పిస్తోంది. విదేశీ సంస్థలు జాతీయం చేయబడవనీ, ఈ సంస్థలు పెట్టుబడిని, లాభాలను తమ దేశాలకు తరలించుకుపోవచ్చుననీ హామీలు ఇవ్వబడ్డాయి. ఆర్థికాభివృద్ధి పథకాలకు విదేశీ పెట్టుబడులు ఒక ముఖ్యాంశమని భారత ప్రభుత్వం భావిస్తున్నది. కనుకనే దేశీయ పెట్టుబడిదారులు పొందుతున్న అనేక సౌకర్యాలను విదేశీ పెట్టుబడిదారులకు కూడా కల్పిస్తున్నది.

ఇదే కాలంలో మొదట దేశాభివృద్ధి మరియు పంచవర్ష ప్రణాళికల పరిపూర్తి పేరిట తర్వాత దేశరక్షణ పేరిట ప్రజలమీద పన్నులభారం పెంచారు. కానీ ఇందులో ఏ ఒక్క కారణంగా నైనప్పటికీ విదేశీ పెట్టుబడిపై పన్ను విధించలేదు. మీదుమిక్కిలి అధికంగానూ, తొందరగానూ ఉత్పత్తి చేయడానికని చెప్పి మరిన్ని రాయితీలను వారికిచ్చారు.

విదేశీ పెట్టుబడులను తృప్తిపర్చేందుకై భారత ప్రభుత్వం కంపెనీల రంగానికి ఇచ్చిన పన్నుల మినహాయింపులో కొన్ని మాత్రమే ఈ దిగువ ఇవ్వబడినాయి.

1. **పన్నుల నుండి పూర్తి మినహాయింపు:** నూతనంగా నెలకొల్పబడే పారిశ్రామిక సంస్థలు పెట్టుబడిలో 6% వరకు ఆర్జించే లాభాలపై 5 సం॥ వరకు పన్నుల నుండి మినహాయించబడ్డాయి. (Tax holiday) ఈ విధంగా పన్నుల నుండి మినహాయించబడిన లాభాల నుండి వాటాదార్లు స్వీకరించే డివిడెండ్లపై (లాభాల వాటా) కూడా పన్నులుండవు.

2. **అభివృద్ధి రిబేటు:** కొత్తగా కర్మాగారం, యంత్రాలు నెలకొల్పినపుడు ఆ ఏడాదికి వాటి ఖరీదులో 20% సమానమైన మొత్తాన్ని పన్ను కట్టాల్సిన మొత్తం నుంచీ మినహాయిస్తారు. ఇది అరుగుదల అలవెన్సులకీ అదనంగా ఇవ్వబడే సౌకర్యం.

3. **పన్నులు లేని అప్పులు:** మూలధన సామాగ్రి దిగుమతి కోసం అనుమతించబడిన విదేశీ సంస్థల నుండి తీసుకొన్న రుణాలు, లేక విదేశాల నుండి బదుళ్ళుగా తెచ్చుకొన్న మొత్తాలు (Loans borrowings debts) వీటికైన వడ్డీలకు మినహాయింపు.

4. **నష్టాలు, అలవెన్సులనీ, తర్వాత సంవత్సరాల లెక్కలలో చేర్చుకొనడాకికి సౌకర్యం:** ఒక పరిశ్రమ ఒక సంవత్సరంలో వచ్చిన లాభాలు ఆ సంవత్సరం అరుగుదల అలవెన్సు (ఈ మేరకు పన్ను ఉండదు) క్రింద మినహాయించడానికి తగినంతగా లేకపోతే, అరుగుదల అలవెన్సులోని ఈ భాగాన్ని ఆ తర్వాత సంవత్సరాలలోని లాభాల నుండి మినహాయించవచ్చును. (దీనికి కాలపరిమితి లేదు) అదే విధంగా అభివృద్ధి రిబేటు, వ్యాపారంలో నష్టాలు కూడా ఆ తర్వాత 8 సంవత్సరాల కాలంలో వచ్చే లాభాల నుండి మినహాయించుకోవచ్చును. (ఈ పద్దుల క్రింద మినహాయించే లాభాల భాగానికి పన్ను మినహాయింపు ఉంటుంది -అను॥)

5. శాస్త్రీయ పరిశోధనలపై ఖర్చు: పన్ను మదింపు కోసం వ్యాపారంలోని లాభాలను లెక్కించేటపుడు ఆ వ్యాపార సంబంధమైన శాస్త్రీయ పరిశోధన కోసం అయిన మూలధన వ్యయాన్ని 5 సంవత్సరాల కాలానికి సర్ది లెక్క చూపవచ్చును. దానితోబాటు వర్తమాన ఖర్చును (Current expenditure) రెవెన్యూ ఖాతాలో చేర్చవచ్చును. దీనికి పూర్తిగా పన్ను మినహాయింపు ఉంటుంది.

6. రాయల్టీలు: 1961 ఏప్రిల్ 1వ తేదీన గాని ఆ తర్వాత గాని జరిగిన ఒప్పందం ప్రకారం భారతీయ సంస్థల నుండి విదేశీ సంస్థ స్వీకరించే రాయల్టీలపై విధించే సూపర్‌టాక్స్‌లో 50% రాయితీ ఉండేలా పన్ను విధింపు 63% వరకూ ఉంటుంది.

7. సాంకేతిక సిబ్బంది: 1961 ఫైనాన్స్ చట్టానికి చేయబడిన ఒక సవరణ ప్రకారం కొత్తగా నియమించబడిన విదేశీ సాంకేతిక నిపుణులు భారతదేశంలో వారు ఉండే మొదటి 36 మాసాల వరకు ఆదాయపు పన్ను నుండి మినహాయించబడతారు. ఆ తర్వాత 24 నెలల కాలానికి మించకుండా సాంకేతిక నిపుణుని జీతానికి సంబంధించి యజమానే పన్ను చెల్లిస్తాడు. అలాంటి పన్ను సాంకేతిక నిపుణుని మొత్తం ఆదాయంలో భాగంగా లెక్కించబడదు.

8. విదేశీ జాతీయులైన ఉద్యోగులు అప్పుడపుడు సెలవుపై స్వదేశానికి వెళ్ళే సందర్భంగా అయ్యే ప్రయాణపు ఖర్చులు ఆదాయపు పన్ను నుండి మినహాయించబడతాయి.

9. విదేశీ పెట్టుబడులకు ప్రధాన అడ్డంకిగా ఉన్న లైసెన్సు మంజూరు చేయడానికి పట్టే కాలయాపనను తొలగించడానికి నిర్దిష్టమైన ప్రయత్నాలు చేయబడ్డాయి.

"పైన వివరించిన దాన్ని బట్టి విదేశీ పెట్టుబడిని ఆకర్షించాలనే తన ప్రకటిత విధానానికి అనుగుణంగా భారతదేశం తీవ్రకృషి సల్పుతున్నట్టు అర్థమవుతుంది. ఇటీవల కాలంలో విదేశీ పెట్టుబడిని ఆకర్షించటానికై అనేకరకాల పద్ధతుల ద్వారా తన ప్రయత్నాలను తీవ్రతరం చేసిందనేది కూడా స్పష్టమే. కొంత కాలంగా ఒక మాదిరి లాంఛన ప్రాయంగా కనిపించిన హామీలను భారతదేశం అమలు జరపడం ద్వారా మార్కెట్లు విశ్వాసం కాకపోయినా రాజకీయంగా విశ్వాసపూరిత వాతావరణం నెలకొల్పబడింది".

(పాలిటిక్స్ ఆఫ్ ఫారిన్ ఎయిడ్-పేజి 155)

**అదుపు చేస్తున్న ప్రయోజనాలు**

విదేశీ ప్రయివేటు పెట్టుబడిదారులు డిమాండు చేస్తున్న అత్యంత ఆరోగ్యకర వాతావరణాన్ని కల్పించి, విదేశీ పెట్టుబడిదారు సాధారణంగా మైనారిటీ వాటాదారు కాబట్టి ఆ విధంగా జాతీయ ప్రయోజనాలు రక్షించబడుతున్నాయనే సునాయాసమైన వాదనతో ప్రభుత్వం దేశ ప్రజలను మోసగించుతున్నది. కంపెనీల రంగం పని విధానపు తీరుతెన్నులను గురించి ఏమాత్రం తెలిసిన వారైనా ఇది బూకరింపని గుర్తిస్తారు. ఆచరణలో 49% అన్న రూలు ఏమంత అర్థవంతమైనది కాదు.

"భారత కంపెనీలలో విదేశీ మిలాఖత్‌దారుల వాటా సాదారణంగా 49% దాటదనీ సర్వేలూ గుర్తించినదే. కాని 25% కంటే హెచ్చు వాటాలున్న విదేశీ మిలాఖత్‌దారులకు వీటో హక్కు ఉంటుంది. ఇది వారికి కంపెనీ సాధారణ సమావేశాలలో ప్రత్యేక తీర్మానాలను అడ్డగించడానికి ఆ విధంగా కంపెనీ వ్యవహారాలపై తగినంత కంట్రోలును ఇస్తుంది. కొన్ని ముఖ్యమైన కంపెనీ నిర్ణయాలకు ప్రత్యేక తీర్మానాలను చేయవలసి ఉంటుందని తెలిసిందే. కంపెనీలలో విదేశీ వాటాలు సగటున 40 నుంచి 49 శాతం వరకూ ఉంటాయి. మైనారిటీ వాటాలు కలిగి ఉన్నందున చట్టరీత్యా పొందలేనటువంటి హక్కులు అనేకం విదేశీ కంపెనీలకు మిలాఖత్ ఒప్పందాల ద్వారా సమకూరుతున్నాయి. విదేశీ మిలాఖత్ దారులకు వాటాలలో 50%కి తక్కువే ఉన్నప్పటికీ, డైరెక్టర్ల బోర్డులో సగం మందిని నామినేటు చేసుకొనే హక్కు ఉండటం చాలా సాధారణ విషయం. కొన్ని సందర్భాలలో మానేజింగ్ డైరెక్టరు, విదేశీ మిలాఖత్‌దారే నామినేట్ చేసే విధంగా ఒప్పందాలలో వీలు కల్పించబడుతుంది. మరికొన్ని సందర్భాలలో ఉత్పత్తి అమ్మకాలకు సంబంధించిన సాంకేతిక విషయాలు విదేశీ మిలాఖత్‌దారులచే నామినేట్ చేయబడిన డైరక్టరు లేదా ఆఫీసరు నిర్ణయానికి వదలివేయాలనే షరతు విధించబడి ఉంటుంది".

(డైరెక్టరీ ఆఫ్ ఫారిన్ కొలాబొరేషన్స్ ఇన్ ఇండియా-వాల్యూమ్1, సెక్షన్3- పేజి 8)

శ్రీ.పి.జె. యల్‌డ్రిజ్ సైతం తన పుస్తకం "పాలిటిక్స్ ఆఫ్ ఫారిన్ ఎయిడ్"లో ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఆయన ఇలా వ్రాశాడు. "ఆచరణలో 49% నిబంధన అనేది ఏమంత అర్థవంతమైంది కాదు. (40% కంట్రోలింగ్ వాటాలు (పెత్తనం వాటాలు) గా రిజర్వు బ్యాంకు అధికార పూర్వకంగా భావిస్తుంది.) పేరుకు మాత్రమే మైనారిటీగా ఉన్న భాగస్వామి అనేక పద్ధతుల

ద్వారా ఆధిపత్యాన్ని కలిగి ఉండటానికి వీలుంటుంది. ఓటింగ్ హక్కుగల వాటాలలో మెజారిటీ భాగం విదేశీ కంట్రోలు క్రిందనే ఉండవచ్చును. లేదా భారతీయ యాజమాన్యాన్ని భారతీయ వాటాదార్ల మధ్య భాగాలుగా విభజించటం వలన కనీసం కొద్దిమంది భారతీయవాటాదార్లు విదేశీ కంట్రోలుకి లోబడి వుండేలా చేసి విదేశీ భాగస్వామి కీలకమైన మేనేజింగ్ పదవులపై తమ కంట్రోలును నిలబెట్టుకుంటూ, లైసెన్సులు, పేటెంట్లు సాంకేతిక పరిజ్ఞానం అందిచడం లాంటి వాటిద్వారా తమ పలుకుబడిని కంపెనీపై చలాయిస్తాడు. భారతదేశంలోని సంస్థలకు విదేశీమారక ద్రవ్యం సమకూర్చడం చాలా కీలకమైన అంశమని కూడా మనం గుర్తుంచుకోవాలి. ఈ కారణంగా ఎంత నామమాత్రమైన వాటాలు ఉన్నప్పటికీ కంపెనీపై పెత్తనం చేయడానికి విదేశీ మిలాఖత్‌దారుకు చాలా అనుకూలమైన అవకాశం ఉంటుంది", (పేజి. 151) ఈ అంశం ఇంకా విశ్లేషిస్తూ జర్మన్ పెట్టుబడిదారులు, జర్మన్ సాంకేతిక, మేనేజీరియల్ సర్వీసులకు ఎందుకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తున్నారో ఆయన వివరించాడు.

"భారత జర్మన్ మిలాఖత్ ప్రాజెక్టులను విశ్లేషణ చేస్తే సాంకేతిక పరిజ్ఞానానికి, మేనేజీరియల్ సర్వీసులకు జర్మన్లు ఇస్తున్న అధిక ప్రాధాన్యత బట్టబయలౌతుంది. భారతీయులకు లాంఛన ప్రాయంగా అంగీకృత రంగాలలోనే శిక్షణ ఇస్తున్నారు" ఎందుకంటే "సాంకేతిక, మేనేజీరియల్ అంశాలపై అదుపు మైనారిటీ పెట్టుబడి కలిగి ఉన్న ప్రారంభదశలోనైనా-ఆ పరిశ్రమపై శక్తివంతమైన అదుపునిస్తుందని గుర్తించారు. వారి దృష్టిలో దీనికి ప్రత్యేక ప్రాధాన్యత ఉందని భావించాల్సి ఉంది", "అన్ని దేశాల పెట్టుబడిదారులూ తమ లెక్కల్లో దీనిని ఒక ముఖ్యమైన అంశంగానే తీసుకొంటారు. కాని జర్మన్ల వైఖరి తమ కంట్రోలు క్రిందలేని సంస్థల పట్ల ప్రత్యేక అనుమానదృష్టిని ప్రదర్శిస్తున్నట్లు కనిపిస్తుంది. అందువలన తమ పెత్తనాన్ని గ్యారంటీ చేసుకోవడానికి దీన్నొక ఇన్సూరెన్సుగా (భీమాగా) పరిగణిస్తారని భావించవచ్చును." (పేజి-158)

అందువల్ల విదేశీ కంట్రోలు లేదా విదేశీ ఆధిక్యత గల పరిశ్రమలకు, భారతీయులు స్వంతంగా కలిగిఉన్న భారతీయుల కంట్రోలులో ఉన్న పరిశ్రమల మధ్య స్పష్టమైన సరిహద్దు రేఖను గీయడం కష్టం.

ఈ విధంగా భారత ప్రభుత్వపు చురుకైన సహకారంతో విదేశీగుత్త పెట్టుబడిదారీ తిమింగిలాలు తమ నిజమైన అధికారాన్ని, పెత్తనాన్ని కప్పిపుచ్చుకొనేందుకై మిలాఖత్ సంస్థలను మునుగుగా వినియోగించు కొంటున్నాయి.



(12వ పేజీ తరువాయి)

పెట్టుబడులు ఎలాంటి నిబంధనలనూ పాటించవు. కాని, ఈ విదేశీ పెట్టుబడులు, అవినీతి లేని లేదా అతి తక్కువ మాత్రమే గల దేశాలకు, పరిపాలనాపర జాప్యాలు లేని దేశాలకు, భూమి, నీరు, విద్యుత్, సరుకుల సులభ రవాణాకు వీలైన రోడ్డుమార్గాలు మొదలైన మౌలిక సౌకర్యాలు గల దేశాలకు, పోస్టల్‌జాప్యాలు మొదలైనవి లేని దేశాలకు తరలి వెడతాయి. ఇవికాక ఆయాదేశాలలో సుస్థిరత, విధానాలలో తరచు మార్పులు ఉండకపోవడం అనేవి కూడా కీలక పాత్ర వహిస్తాయి. మనం స్పెక్యులేటివ్ పెట్టుబడులపట్ల, వాటి సంపాదనలపట్ల, స్వాధీనాలపట్ల జాగ్రత్తగా ఉండాలి.

అభివృద్ధికి విదేశీ పెట్టుబడులు-ప్రధానంగా ఉత్పాదక పెట్టుబడులు రూపంలో-అవసరం. అయితే అభివృద్ధి సాధించడం కోసం, మనం ప్రధానంగా విదేశీ పెట్టుబడులపైనే ఆధారపడరాదనే మాట వాస్తవం. అభివృద్ధి సాధించడంకోసం మనం అంతర్గత వనరులను, అలాగే విదేశీ పెట్టుబడులను కూడా సమీకరించేందుకు అన్ని ప్రయత్నాలూ చేయాలి. మొత్తం పెట్టుబడులలో విదేశీ పెట్టుబడులు ఒక చిన్న భాగంగా మాత్రమే ఉండాలి.

కాని, విప్లవాత్మక మార్పుకి సంబంధించిన శక్తి లేకుండా, పరిస్థితి మెరుగుపడదు. భారతదేశ ప్రజలు ఒకమార్పుకోసం ఓటువేశారు. కాని ప్రొ॥పట్నాయక్ ప్రకారం, "మహా అయితే, మానవతాముఖంలో సరళీకరణ వంటి కొన్ని నోటి మాటలు మాత్రమే వారికి పడవేయడం జరుగుతుంది" కాని, అవి సారవంతమైన మార్పులకు దారి తీయవు. నూతన విక్షేప మార్గాన్ని అవలంభించే స్థైర్యంగల ఒక ప్రజాస్వామ్యవాదే అధికారాన్ని చేపట్టినాకూడా, ఆ ప్రభుత్వంపై విరుచుకు పడడానికి ఫాసిస్టు శక్తులు ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాయి. ఆ విధంగా ప్రొ॥పట్నాయక్ ప్రకారం-విప్లవమూ లేదు, మరోటీలేదు! అప్పుడు యుపిఎ ప్రభుత్వానికి వామపక్షాల మద్దతు ఉపసంహరించాలి. ఇక అప్పుడు ప్రత్యామ్నాయం-అమెరికా అనుకూల, మతతత్వఫాసిస్టు శక్తులు అధికారంలోకి వస్తాయి తప్ప విప్లవ ప్రభుత్వం-మాత్రంకాదు! మార్పుకి దారితీసే కొన్ని తాత్కాలిక మార్గాలు-ఉన్నా, వాటిని-విప్లవకరశక్తులు అధికారాన్ని చేపట్టగలిగే పరిస్థితి ఏర్పడ్డాక మాత్రమే చేపట్టాయి.

ప్రస్తుతం, మూడు వామపక్ష రాష్ట్రాలలో మొత్తం సీట్లన్నీ గెలుచుకున్నా కూడా వామపక్షాలు ప్రభుత్వం ఏర్పాటుచేయలేవు. సోషలిజం అనే అంతిమ లక్ష్యానికి నష్టం కలగకుండా, ప్రస్తుత పరిస్థితులను బట్టి ఆర్థిక విధానాలను రూపొందించుకోవాలి. అందువల్ల ఈ సమయంలో మనం కాంగ్రెస్ నాయకత్వంలోని ప్రగతిశీల ఐక్యకూటమి ప్రభుత్వంపట్ల ఐక్యత-పోరాటం విధానాన్ని చేపట్టాము.



# కమ్యూనిస్టుల దృక్పథంలో....డబ్బు

-డి.పాపారావు

మనం ప్రస్తుతం వున్న పెట్టుబడిదారీ వ్యవస్థలో డబ్బు పాత్ర గురించి తెలియని వారు బహుశా ఎవ్వరూ వుండరు. అంటే ప్రస్తుత వ్యవస్థలో ప్రతి దానికీ మూలంగా ఈ డబ్బు వున్నట్లుగా కనపడుతోంది. కానీ, చివరకు పెట్టుబడి వ్యవస్థ ముగింపు తరువాత సోషలిజం క్రింద డబ్బు పాత్ర నశిస్తుందని కార్ల్ మార్క్స్ చెప్పటం సుపరిచితమే. దనర్థం రాజ్యంలాగానే డబ్బు కూడా దుళ్ళిపోతుందని. ఈ మొత్తం నేపథ్యంలోనే నాటి సోవియట్ రష్యా విప్లవపు తొలిదశలో బోల్షివిక్కులు (రష్యా కమ్యూనిస్టులు) డబ్బును తమ దేశంలో చలామణి నుంచి రద్దు చేస్తూ నిర్ణయం తీసుకున్నారు. అయితే పలు కారణాల దృష్ట్యా ఈ నిర్ణయం ఆచరణలో విఫలం అయింది. అంటే ప్రపంచ వ్యాప్తంగా తమ చుట్టూ డబ్బు రాజ్యమేలుతున్న కాలంలో రష్యాలో కమ్యూనిస్టులు డబ్బును రద్దుచేయలేకపోయారు. కానీ నేడు డబ్బు రూపాలు మారిపోవడాన్ని మనం కళ్ళారా చూస్తున్నాం. ఎలక్ట్రానిక్ మనీ, క్రెడిట్ కార్డుల వంటివి నేడు వాస్తవ రూపంలో డబ్బు లేకుండానే వినియోగంలో వున్నాయి. దీని సారం మెల్లమెల్లగా డబ్బు రూపాలను మార్చుకుంటూ అంతిమ పతనం దిశగా సాగుతోంది. డబ్బు స్థానంలో ఇతరేతర నూతన రూపాలు పెట్టుబడి వ్యవస్థ గర్భంలోనే ఆవిర్భవిస్తున్నాయి. కంప్యూటర్ల ద్వారా ఎలక్ట్రానిక్ లావాదేవీలు మెల్లమెల్లగా ఆరంభం అవుతున్నప్పుడు డబ్బు చిరకాలం మనలేదనేది తెలిసి పోతోంది. కాబట్టే డబ్బు రూపాలు మార్చుకోవటం గురించి, కొంత మేరకు అంతర్ధానం అయిపోవటం గురించీ "ది ఫ్యూచర్ ఆఫ్ మనీ", "ది ఎండ్ ఆఫ్ మనీ", "ది హిస్టరీ ఆఫ్ మనీ" వంటి పుస్తకాలు స్వయానా పెట్టుబడిదారీ పరిశోధకుల నుంచే వెలువడడం. అంటే, ఈ విషయంలో మార్క్స్ నిర్ధారణలు వాస్తవ రూపం ధరించేందుకు పునాదులు ఏర్పడుతున్నాయని మనం గమనించాలి.

మరో ప్రక్కన పరాయీకరణ (Alienation) అనే అంశం గురించి కూడా మార్క్స్ చెప్పిన మాటలను నేటి కాలంలో మనం గుర్తు చేసుకోవచ్చు. పరాయీకరణ అంటే, పెట్టుబడిదారీ వ్యవస్థలో మానవుడు తాను సృష్టించిన సంపద నుంచి తానే వేరుపడిపోవడం. చుట్టూ వున్న వస్తువుల ప్రపంచానికి మానవుడు అధిక ప్రాధాన్యతను ఇవ్వటం. దీనర్థం పెట్టుబడిదారీ వ్యవస్థలో మానవుడు తాను సృష్టించిన సంపదకు తానే బానిస అవుతున్నాడు. తన సహజ గుణాలను కోల్పోయి, ఆ గుణాలను వెలుపలి ప్రపంచంలో వున్న సరుకులకు లేదా డబ్బుకు ఆపాదిస్తున్నాడు. స్వయంగా తనలో తాను డొల్లగా మిగిలిపోతున్నాడు. తన శక్తి సామర్థ్యాలను పరాయీకరించుకొని తను సృష్టించిన సంపదకు తానే బానిస అయిపోతున్నాడు. నేటి వినియోగదారుల యుగంలో అతను విలువను తాను ప్రోగుచేసుకున్న, తన చుట్టూ వున్న వస్తు సంపద, డబ్బుల విలువ ద్వారా కొలుచుకుంటున్నాడు. మొత్తం మీద మన ప్రపంచంలో అన్ని సంపదలకు మూలం అయిన మానవుడు తానే స్వయంగా ఆ సంపదలకు లోబడిపోయి తనకుతాను దూరం అయిపోతున్నాడు. పరాయీకరణకు మార్క్స్, ఏంగెల్స్‌లు తమ రచనలలో విశేష ప్రాధాన్యతను ఇచ్చారు. పెట్టుబడిదారీ వ్యవస్థలో ఈ పరాయీకరణ శృతి మించి రాగానపడుతుందని వారు ముందుగానే వూహించారు. యూరప్‌కు చెందిన సోషల్ డెమోక్రాటిక్ రచయిత అయిన ఎరిక్‌ఫ్రామ్ వంటి వారి రచనలలో కూడా పరాయీకరణ గురించి సుదీర్ఘ వివరణలు వచ్చాయి. పరాయీకరణ గురించిన ఎరిక్‌ఫ్రామ్ ఆలోచనలు, మార్క్స్ ఆలోచనలను మరింత విశదపరిచాయి. ఫ్రామ్ రచించిన "ది సేన్ సొసైటీ" అనే పుస్తకంలో పలులోపాలు వున్నప్పటికీ అది పరాయీకరణ గురించి మాత్రం సవివరమైన, విపులమైన వివరణను ఇవ్వగలిగింది. పరాయీకరణ పరాకాష్టకు చేరుకున్నప్పుడు, వ్యక్తులు తాము సృష్టించిన సంపదకు తామే పూర్తిగా దూరమైపోయినప్పుడు వారు అచేష్టులైపోతారని ఫ్రామ్ వివరించాడు. అంటే పరాయీకరణ ముదిరి పాకానపడే కొద్దీ పెట్టుబడి వ్యవస్థ ఇక ఎంత మాత్రమూ పనిచేయలేని స్థితి వస్తుందని ఫ్రామ్ పేర్కొన్నాడు. దీనర్థం పరాయీకరణ అనేది పెట్టుబడిదారీ వ్యవస్థ పతన లక్షణాలలో ఒక ప్రధాన అంశం అనేది.

ఇప్పటి వరకూ మనం డబ్బు, పరాయీకరణ గురించి కాస్తంత పరిశీలించాం. ఈ రుగ్మతలు వున్న పెట్టుబడిదారీ వ్యవస్థను అధిగమించేందుకుగాను ఈ రుగ్మతలకు లోను కాని, వాటిని అధిగమించిన కమ్యూనిస్టులు అవసరం. అంటే కమ్యూనిజం అనేది అత్యున్నత మానవత్వం అనే అర్థంలో. చరిత్ర క్రమంలో మానవుడు కోల్పోయిన మానవీయ లక్షణాలను తిరిగి అతడికి పునరుద్ధరించాలనే అర్థంలో. దీనికి గాను కమ్యూనిస్టులు నేటి దోపిడీ వ్యవస్థ తాలూకు డబ్బు సముద్రంలో వుండి కూడా తమ మానవీయ విలువలను, తమ కమ్యూనిస్టు లక్ష్యాలను విడిచి పెట్టరాదని. అంటే వారు డబ్బును తామరాకు మీద నీటిబొట్టులా స్వీకరించగలగాలి. డబ్బుకు లోబడిపోయి పరాయీకరణ చెందిన, తమ మానవత్వాన్ని ఆవిష్కరించుకొని కమ్యూనిస్టులు నూతన సమాజాన్ని నిర్మించలేరు. ముఖ్యంగా నేటి పెట్టుబడిదారీ వ్యవస్థను అధిగమించి మానవీయ సోషలిస్టు వ్యవస్థను సాధించేందుకు డబ్బు జబ్బు పట్ల పూర్తి అవగాహన వుండాలి. అంటే నేటి దోపిడీ వ్యవస్థలో చుట్టూ కమ్ముకొని వున్న డబ్బును, నేటి దాని ప్రాధాన్యతను విస్మరించకుండానే కమ్యూనిస్టులు తమ మానవత్వాన్ని, మానవ అస్థిత్వాన్ని కాపాడుకో గలిగారు. ప్రస్తుత వ్యవస్థను అధిగమించటంలో వారు డబ్బును కేవలం ఒక పనిముట్టుగా మాత్రమే చూడగలగాలి. విప్లవాన్ని సాధించేందుకు రోడ్డుపై దొరికిన స్టెను కూడా వాడుకోగల కార్యదీక్షను కమ్యూనిస్టులు డబ్బు పట్ల చూపగలగాలి. అలాగే తమ మానవీయ

గుణాలను తమ నుంచి దూరంచేసే పెట్టుబడి వ్యవస్థ తాలూకు పరాయీకరణను కూడా కమ్యూనిస్టులు అధిగమించాలి.

దీనంతటి సారం కమ్యూనిస్టులు అనే వారు డబ్బు పట్ల సమాజంలో చాలా మందిలో కపపడే ద్వంద్వత్వాన్ని అధిగమించాలి. డబ్బు పట్ల ఒక ప్రక్కన "పైకి" తృణీకార భావంగా కనపడే ఆలోచనల తాలూకు ఒక కొసకు గానీ లేదా డబ్బునే సర్వస్వంగా చూసే రెండో కొసకు గానీ మనం వెళ్ళరాదు. ప్రస్తుత వ్యవస్థను అధిగమించే వరకూ మన అంతిమ లక్ష్యాల సాధనలో మనం డబ్బును పరిమితంగా, దానికున్న ప్రాముఖ్యత మేరకు మాత్రమే దానిని ఆమోదించగలగాలి. ముందే పేర్కొన్నట్లుగా డబ్బును తామరాకు మీద నీటిబొట్టులా అంగీకరించ గలగాలి. అంటే పార్టీ కార్యక్రమాలకై డబ్బు ఎంతో కొంత మేరకు తప్పనిసరిగా అవసరం. అయితే డబ్బు లేకుండా ఏ పనినీ చేయలేమని భావించటం కమ్యూనిస్టు లక్షణం కాదు. దీనికి తార్కాణమే ఈ వ్యవస్థలో వివిధ స్థాయిలో జరిగే ఎన్నికలలో గెలుపు కోసం డబ్బునే సర్వస్వంగా మనలోని కొందరు భావించుకొనే ఒక కొస (extreme). మరో ప్రక్కన డబ్బు ఎక్కువైతే చెడిపోతారు అనుకొనే రెండవ కొస. జనం కోసం పనిచేస్తూ జనంతో జీవిస్తున్న పార్టీ ఈ రెండు కొసలనూ అధిగమించాలి. డబ్బు పట్ల సమతుల్యత గల దృక్పథాన్ని చూపగలగాలి.

ఈ రెండు కొసలకూ సంబంధించిన అంశం వచ్చినప్పుడు ఈ మధ్య కాలంలో జరిగిన ఆసియా సోషల్ ఫోరం సమావేశాలు గుర్తుకు వస్తున్నాయి. ఈ సమావేశాలలో సి.పి.ఐ., మార్క్సిస్టుపార్టీల వారు కూడా చురుకైన పాత్రను వహించారు. మరో ప్రక్కన కొన్ని ఇతర కమ్యూనిస్టు పార్టీల వారు ఈ సమావేశాలను బహిష్కరించారు. కాగా, ఈ అంశాన్ని లేవనెత్తడంలో నా ప్రధాన ఉద్దేశ్యం సోషల్ ఫోరం సమావేశాలలో పాల్గొనటం లేదా పాల్గొనకపోవటం తాలూకు సైద్ధాంతిక చర్చలోకి వెళ్లటం కాదు. ఈ సమావేశం సందర్భంగా ముందుకు వచ్చిన ఒక ప్రశ్న అయిన డబ్బును గురించి ప్రస్తావించటమే నా ఉద్దేశ్యం. ఈ సమావేశాన్ని బహిష్కరించిన వారిలో కొందరు సోషల్ ఫోరం సమావేశాలలో పాల్గొనటం ద్వారా కొన్ని కమ్యూనిస్టు పార్టీలు డబ్బు రుగ్మతకు లోబడిపోయే అవకాశం వుందని సందేహాలను వెలిబుచ్చటం గురించి ప్రస్తావించటం తప్పని సరి. అంటే, ఈ వాదనలు చేస్తున్నవారు కమ్యూనిస్టులు డబ్బుకు దూరంగా వుండాలని చెబుతున్నట్లుగా వుంది. కాగా ఏ కమ్యూనిస్టు పార్టీ అయినా అసలు డబ్బే లేకుండా తన కార్యకలాపాలను నిర్వహించుకోగలదా అనేది అసలు ప్రశ్న. కమ్యూనిస్టు అనే వాడు కాస్తంత ఎక్కువగా తన చుట్టూ డబ్బు రాగానే తన విప్లవ లక్ష్యాలను విస్మరించే వాడుగా వుండరాదు. డబ్బుకు లోబడిపోరాదు. నేటి వర్గ సమాజంలో కమ్యూనిస్టులు అనివార్యంగా వివిధ స్థాయిలో డబ్బుతో వ్యవహరించవల్సి వుంటుంది. ఎక్కువ డబ్బు మధ్యకు వెళ్ళినంత మాత్రాన తన కమ్యూనిస్టు లక్ష్యాలను కోల్పోయేవాడు నిజమైన కమ్యూనిస్టు కాదు. అటువంటి వ్యక్తి ఏదో ఒక పరిస్థితిలో ఉద్యమం నుంచి జారిపోతాడు. అంతే కాకుండా కమ్యూనిస్టుల అంతిమ లక్ష్యం రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవటమని చెబుతున్నాం. కాగా, రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవడం అంటే పాలనాధికారం, రాజ్యం తాలూకు ఖజానాలను కూడా కైవసం చేసుకోవటం. ఈ స్థితిలో నేడు సంపూర్ణంగా డబ్బుకు దూరంగా వున్న కమ్యూనిస్టు పార్టీయే, రేపు శ్రామికవర్గ రాజ్యాన్ని నిర్మించగలదను కోవటం సరైనదేనా? నేడు డబ్బును పూర్తిగా తృణీకార భావంతో, తిరస్కారంతో అన్ని పరిస్థితుల లోను నెట్టివేసే కొసకు వెళ్ళిన కమ్యూనిస్టు పార్టీ రేపు రాజ్యాధికారాన్ని చేపట్టిన తర్వాత అయినా సరే మరో కొసకు వెళ్ళి డబ్బుకు, విలాసాలకు లోబడదని హామీ ఏమిటి? నేటి వ్యవస్థలో డబ్బును పూర్తిగా తిరస్కరించటం, డబ్బే సర్వస్వం అని భావించటం ఈ రెండూ రెండుకొసలని మనం ముందుగానే చెప్పుకొన్నాం. మార్క్సిస్టు గతితార్కిక సూత్రాల ప్రకారంగా పరస్పర విరుద్ధ అంశాలు కలిసే వుంటాయి. అంటే ఒక (extreme) రెండవ extreme తో కలిసే వుంటుంది. అంతే కాకుండా జీవితంలో కానీ, సిద్ధాంతంతో కానీ ఒక కొసకు (extreme) వెళ్ళినవారు లేదా పార్టీలు అనివార్యంగా రెండవ కొసకు చేరితీరుతాయి. కాబట్టి డబ్బుపట్ల కూడా ఏ extreme కూ పోని సమతుల్య దృక్పథం కమ్యూనిస్టులకు అవసరం. తప్పనిసరి పరిస్థితిలో ఫైవ్‌స్టార్ హోటల్‌లో కూర్చున్న లేదా తన శ్రామిక జనం తిరుగాడే కాకాహోటల్లో కూర్చోన్నా నిజమైన కమ్యూనిస్టు తన వర్గ దృక్పథాన్ని, వ్యక్తిగత స్వభావాన్ని, అంతిమలక్ష్యాలను మరచిపోడు. దీనినే తామరాకు మీద నీటిబొట్టు స్వభావంగా మనం ముందే వివరించుకున్నాం. అందుచేత నేడు మనం పెట్టుబడిదారీ వ్యవస్థలో జీవిస్తున్నాం అని, దీనిని అధిగమించేందుకు పనిముట్లు, సాధనాలు ఈ వ్యవస్థ పరిమితిలోనే దొరుకుతాయనీ, అవి గాలినుంచి వూడి పడవని మనం మరచిపోరాదు. ఈ మొత్తం క్రమానికి గతంలోని సోవియట్ యూనియన్ ఒక మంచి ఉదాహరణ. సోవియట్ యూనియన్ పతనానికి కారణం. ఆ దేశ కమ్యూనిస్టు నాయకత్వం ప్రజలకు దూరంగా ఒక భిన్నమైన, విలాసవంతమైన జీవిత సరళిని గడపటం అనే ఆరోపణను, వాస్తవాన్ని కూడా మనం విన్నాం. ఈ వైఫల్యానికి కూడా ఒక ప్రధాన కారణం కొన్ని కమ్యూనిస్టు పార్టీలలో వున్న నాయకత్వం, క్యాడర్‌లు కమ్యూనిజం శాస్త్రీయత, ఆ కోణం నుండి డబ్బు పాత్ర వంటి వాటిని సరిగ్గా విశ్లేషించుకోవడంలో వున్న అసమగ్రత. మించి, ద్వంద్వ ప్రవృత్తి. కమ్యూనిజాన్ని కేవలం "పేదలకు" సోషలిజం క్రింద నేటి ధనవంతుల జీవన సరళిలాగానే ఒక జీవనసరళిని ఇవ్వడం అనుకొనే అపభ్రంశపు భావన. కమ్యూనిజం అనది కేవలం భౌతిక సంపత్తికి విలువలకు సంబంధించినది కూడా. కమ్యూనిస్టు వ్యక్తిత్వం అనేది పూర్తిగా భిన్నమైనది. అందుచేతనే లెనిన్ కమ్యూనిస్టు అంటే ఒక ప్రత్యేక తరహాకు చెందిన వ్యక్తి అని అతనికి అంతిమ లక్ష్యమే సర్వస్వం అని వివరించాడు. ఈ రకమైన నూతన మనవీయ వ్యక్తిత్వాల క్రొత్త సమాజాన్ని ఆవిష్కరించేందుకు మనం

తప్పని సరిగ్గా కమ్యూనిస్టు వ్యక్తిత్వాన్ని కేవలం ఆవేశంతోనే కాక ఆలోచనలతో కూడా అర్థం చేసుకోవాలి. జీర్ణం చేసుకోవాలి. లేని పక్షంలో కమ్యూనిస్టు సిద్ధాంతం తన శాస్త్రీయతను కోల్పోయి మరో మతంగా మారిపోగలదు.

ఈ నేపథ్యంలో కమ్యూనిజాన్ని ఒక శాస్త్రంగా జీర్ణించుకొని, సమతుల్యత గల దృక్పధాన్ని ఏర్పరచుకోవడం నూతన సమాజ సాధనకు తప్పనిసరి. ఈ సందర్భంలోనే మనం కమ్యూనిస్టులుగా వినియోగించే ఒక పదాన్ని గురించి కూడా ఉదహరించవచ్చు. ఆ పదమే "త్యాగం" అనేది. కొన్ని సందర్భాలలో ఈ మాటకు శాస్త్రీయత, విలువ వున్నాయి. అయితే పలు సందర్భాలలో ఈ పదం మన శాస్త్రీయతను, విప్లవ దృక్పధాన్ని, నూతన సమాజం పట్ల వున్న అవగాహనను తప్పుద్రోవ పట్టించేదిగా వుండగలదు.

మనం పెట్టుబడిదారీ వ్యవస్థను అమానుషమైనదిగా, మనిషిని దిగజార్చేదిగా చూస్తాం. కాగా, దీని ప్రకారం పెట్టుబడిదారీ వ్యవస్థలో ఒక వ్యక్తి కమ్యూనిస్టు కావటం అంటే అతను లేదా ఆమె సాపేక్షంగా పరిపూర్ణ మానవత్వాన్ని పొందటమే. ఈ అర్థంలోనే మార్క్సిజం అనేది మహత్తర మానవతావాదమని మనం చెబుతాం. అయితే కమ్యూనిజాన్ని విముక్తికి మార్గంగా ఎంచుకొని పోరాటం చేసిన వారిని మనమే స్వయంగా "త్యాగ"ధనులని అంటాం. ఇది ద్వంద్వత్వం కాదా? కమ్యూనిజం అనేది ఉన్నత మానవత్వం అయినప్పుడు దానిని స్వీకరించటం, ఆ లక్ష్యం కోసం పోరాడటం ద్వారా వ్యక్తులు తిరిగి తమ మానవత్వాన్ని తాము ఆవిష్కరించుకోవటం లేదా? దీనిలో కోల్పోతున్నది ఏమిటి? పెట్టుబడిదారీ వ్యవస్థ తాలూకు ఏకపక్ష, దోపిడీ, అమానుష వ్యక్తిత్వాన్ని మినహా మనం కోల్పోతున్నది ఏమిలేదు. అయితే త్యాగం వంటి మాటలను అతిగా వాడటం పెట్టుబడిదారీ వ్యవస్థ, దానిలో డబ్బుతో లభించే "సుఖాల" పట్ల ఉన్న భ్రమకు నిదర్శనం కాదా? మనం సోషలిజాన్ని నిర్మిస్తామంటున్నది జనంలో ప్రతివ్యక్తినీ ఒక బూర్జువా "సుఖాల" వెంపర్లాటపరుడిగా చేసేందుకా? ప్రతిదానికీ డబ్బుతోనే విలువను కట్టే unconscious పాత అలవాటుకు ఇది తార్కాణం కాదా? మనం పెట్టుబడిదారీ వ్యవస్థ తాలూకు పరాయీకరణను అధిగమించగలగాలంటే ఈ ధోరణి ఆటంకం కాదా? ఇటువంటి తీరులో కమ్యూనిస్టులు సామాన్య జనంలో విలువను గెలుచుకోలేరు. కాగా పోగా డబ్బుకు అతిగా ప్రాధాన్యతను ఇచ్చే ఈ ధోరణుల వలన మనం కడకు ఆ డబ్బు జబ్బు చేతిలోనే ఓటమి పాలౌతాం. సోవియట్ యూనియన్ పతనం వెనుక వున్నది కూడా డబ్బు పట్ల వున్న ఈ ద్వంద్వ ప్రవృత్తే. సోషలిజం నిర్మాణం అనేది నూతన మానవతా వ్యక్తిత్వాల ఆవిష్కరణ కోసం అని మరచిపోయి సోషలిజం ద్వారా కేవలం అత్యంత అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోని ప్రజల "perverted" సుఖాలను సోవియట్ వ్యవస్థలోని ప్రజలందరికీ హామీ చేస్తాననటం, చేయాలనుకోవటం జరిగిన అసలు పొరపాటు. ఈ కారణం చేతనే చాలా సందర్భాలలో సోవియట్ యూనియన్ నాయకులు కొందరు తమ దేశంలోని ప్రజల భౌతిక సంపత్తిని అమెరికా వంటి దేశాల ప్రజల భౌతిక సంపత్తితో పోలుస్తూ వచ్చారు. ఇన్ని సంవత్సరాల లోపుగా సోవియట్ ప్రజలకు కూడా అమెరికా ప్రజల భౌతిక సంపత్తి స్థాయిని సాధించి పెడతామని వాగ్దానం చేస్తూ వచ్చారు. ఈ పెడ ధోరణి వలన సోషలిస్టు మానవుడి సాధనకు అవసరమైన ఒక ప్రధాన అంశమైన సాంస్కృతిక మార్పు నిర్లక్ష్యం చేయబడింది. డబ్బు పట్ల పూర్తి తృణీకార భావంగా "పైకి కనబడే" ఒక extreme- డబ్బే సర్వస్వంగా చూసే మరో extreme కు దారి తీసింది. కాబట్టి డబ్బుకు ఇవ్వవల్సినంత పాత్రను మాత్రమే ఇవ్వాలి. డబ్బును, వ్యవస్థను మార్చేందుకు ఉపయోగపడే ఒక చిన్న పనిముట్టుగా మాత్రమే చూడగలగాలి. చుట్టూ డబ్బు వున్నప్పుడు కూడా దానితో detached గా వుండగలగాలి. ఇలా చేయలేనివారు కమ్యూనిస్టులుగా అవతారం ఎత్తటం ప్రజలలో మార్క్సిజం పట్ల అవగాహనా రాహిత్యానికీ, అపహాస్యానికీ మాత్రమే దారి తీయగలదు.

దీనంతటి సారాంశం ధనమూలం ఇదం జగత్తుగా నడిచే పెట్టుబడిదారీ వ్యవస్థలో విప్లవసాధనకు డబ్బు పట్ల వుండే మన extreme భావనలు ఆటంకం కారాదని. సోషలిజం క్రింద డబ్బును, పరాయీకరణను అధిగమించగలిగేంత వరకూ మనం డబ్బుకు వాస్తవ ప్రపంచంలో వున్న స్థానాన్ని సమతుల్యతతో అంచనా వేయగలగాలి. కాగా, కమ్యూనిస్టులు తమ అసలు బలమైన జనబలాన్ని గౌరవిస్తూనే శ్రామిక ప్రజల అంతిమ విజయానికి పెట్టుబడిదారీ వ్యవస్థలో లభించే పనిముట్లన్నింటినీ వాడుకొనే తీరాలి. అదే సమయంలో మనం ముందుగానే పలుమార్లు చెప్పుకున్నట్లుగా మనం పెట్టుబడిదారీ ప్రలోభాలకు లోనుకాకుండా తామరాకు మీద నీటిబొట్టులా వ్యవహరించగలగాలి. ఏ ఒక్క extreme కూ పోని ఈ దృక్పధం మాత్రమే మన అంతిమ విజయానికి హామీ. పెట్టుబడిదారీ పరాయీకరణను అధిగమించని వారికి ఈ విషయాన్ని ఎంతగా చెప్పినా బోధపడదు. వారికి అర్థం అయ్యేది, వారు బలంగా భావించేది చుట్టూ వున్న డబ్బు తాలూకు భౌతిక వస్తువుల బలాన్ని మాత్రమే. ఈ పరాయీకరణను అధిగమించని కమ్యూనిస్టులు ఒక extreme లో డబ్బును పైకి తృణీకార భావంతో చూసేవారు గానో, మరో extreme లో సర్వస్వంగా భావించేవారుగానో మాత్రమే వుండగలరు. ✣


## చందాదారులకు విజ్ఞప్తి

డిసెంబరు 2004 ఆఖరుతో చందాలు అయిపోయినవారు 2005 సంవత్సరానికి వార్షిక చందా రు. 140లు మనియార్డరు ద్వారాగాని, సమతాపబ్లికేషన్స్ పేరుతో డ్రాఫ్ట్ ద్వారాగాని పునరుద్ధరించుకోవాలని విజ్ఞప్తి

మానేజర్

# స్వావలంబన స్వరూప స్వభావాలు

-ఎన్.వేణుగోపాల్

ఇటీవలి కాలంలో స్వావలంబన అనేమాట విస్తృతంగా వినబడుతోంది. దాదాపుగా దేశంలో నూతన ఆర్థిక విధానాలు అమలు కావడం మొదలయినప్పటి నుంచీ కొన్ని రాజకీయ పక్షాలు. కొందరు మేధావులు లేవనెత్తుతున్న ఈ నినాదం ఈ మధ్య మరింత ప్రాచుర్యంలోకి వచ్చింది. ఈ ఇరవై ఒకటో శతాబ్దపు ప్రపంచీకరణ యుగంలో ఈ నినాదానికి అర్థం లేదని, ఒకవేళ నినాదం మంచిదే అయినా ఇప్పుడు సాధ్యం కాదని కొందరు వాదిస్తుండగా, భారతదేశం వంటి సుసంపన్నమైన వనరులున్న దేశంలో, సామ్రాజ్యవాద దోపిడీ పీడనలు పెరిగిపోతున్న సమయంలో ఇది చాలా అవసరమైన విధానమని మరికొందరు వాదిస్తున్నారు. ఈ నేపథ్యంలో అసలు స్వావలంబన అంటే ఏమిటి, ప్రస్తుత తరుణంలో దాన్ని ఎలా అర్థం చేసుకోవాలి, ఆ విధానం రాజకీయార్థిక ఆలోచనలలోకి వచ్చిన చరిత్ర ఏమిటి, ఇప్పుడు ఆ నినాదం అవసరమేమిటి చర్చించవలసి ఉంది.

మొట్టమొదట, స్వావలంబన గురించి ఉన్న రెండు మూడు అపోహలను తొలగించాలి. స్వావలంబన అంటే సొంత వనరుల మీద ఆధారపడి అవసరాలను తీర్చుకోవడం, అవసరాలకు తగినట్టుగా సొంత వనరులను పెంచుకోవడం. అంతే గాని, కొందరు అపార్థం చేసుకొంటున్నట్టుగా తలుపులు మూసుకుని కూచుని, అవసరాలను తగ్గించుకోవడం కాదు. అయితే ప్రతి అవసరాన్నీ సమీక్షించి, అది నిజమైన అవసరమేనా, కేవలం అమ్మకం దార్ల, ఉత్పత్తిదార్ల, మదుపు దార్ల లాభాల వేటలో మన మీద రుద్దబడుతున్నదా అనే నిర్ధారించిన తర్వాతనే అవసరాలను తీర్చడం అనే విధానం స్వావలంబనలో ముఖ్యమైనది. అంటే అవసరాలను సరుకులవైపు నుంచి కాక మనుషుల వైపు నుంచి, మారకపు విలువల వైపు నుంచి కాక ఉపయోగ విలువల వైపు నుంచి చూడడం స్వావలంబనకు పునాది. అప్పుడు కూడా ఏ సమాజానికి ఆ సమాజమే తయారు చేసి, తీర్చుకోలేని అవసరాలు మిగిలిపోవచ్చు. ఆ అవసరాల సంతృప్తి కోసం ఇతర సమాజాల మీద ఆధారపడవలసి రావచ్చు. ఆ ఇతర సమాజాలతో సంబంధం దాత-గ్రహీత సంబంధంలా అసమానంగా కాక, స్నేహ పూర్వకంగా, సమానస్థాయిలో ఉండాలనేది కూడా స్వావలంబనలో ముఖ్యమైన అంశం.

అంటే, స్వావలంబన అనగానే ఆధునిక మానవ అవసరాలను కుదించి, సమాజానికీ, ఆర్థిక వ్యవస్థకూ తలుపులు మూసి, ఒక ఇనుపతెర కప్పిన సమాజాన్ని సృష్టించడం అని సాగుతున్న దుష్ప్రచారాన్ని తిప్పికొట్టాలి. ప్రాచీన భారతగ్రామం స్వయం సమృద్ధంగా, స్వావలంబితంగా ఉన్నదని భావించిన ఆర్థిక చరిత్ర కారులు కూడా కనీసం వ్యవసాయావసరమైన ఇనుము కోసం, ఆహారావసరమైన ఉప్పుకోసం గ్రామాల మధ్య ఆదాన ప్రదానాలు ఉండి ఉంటాయని ఊహించారు. సమస్యల్లా ఈ ఆదాన ప్రదానాల ప్రాతిపదిక సమానత్వం అవునా కాదా అనేదే.

మరొక అపోహ, స్వావలంబన పాత సమాజాల్లో, గత శతాబ్దాల్లో సాధ్యమై ఉండేదేమో గాని ఆధునిక సమాచార, రవాణా సంబంధాలు విస్తరించిన ఈ రోజుల్లో సాధ్యం కాదనేది. అంటే అమాయకంగా ఈ అపోహను నమ్ముతున్న వాళ్ళకు, ఉద్దేశ్యపూర్వకంగా ఈ దుష్ప్రచారాన్ని కొనసాగిస్తున్నవాళ్ళకు లోలోపల ఉన్న దురభిప్రాయమేమంటే స్వావలంబనకూ సాంకేతికాభివృద్ధికీ చుక్కెదురని. ఇది పూర్తిగా అబద్ధం. స్వావలంబన రాజకీయార్థిక విధానాలు ఆధునిక శాస్త్ర, సాంకేతికాభివృద్ధికి వ్యతిరేకం కావు. ఆ రాజకీయార్థిక దృక్పథం కోరేదల్లా శాస్త్ర, సాంకేతిక ఫలాలు అందరికీ అందాలని మాత్రమే. శాస్త్ర, సాంకేతిక అన్వేషణలు కొందరి గుత్తసొమ్మయి, అసంఖ్యాక ప్రజలు, దేశాలు వారి మీద ఆధారపడి, వారి దయాదాక్షిణ్యాల మీద బతకవలసిన స్థితి ఉండగూడదని మాత్రమే. శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి కొన్ని ప్రాంతాల మీద, కొన్ని ప్రజాసమూహాల మీద కొన్ని బహుళజాతి సంస్థలకు అధికారం ఇచ్చే సాధనం కాగూడదని మాత్రమే. అసలు సొంతంగా, సహజంగా శాస్త్ర, సాంకేతిక అభివృద్ధిని సాధించని సమాజమేదీ లేదు. పెట్టుబడిదారీ విధానం వచ్చే వరకూ మానవ చరిత్రలూ అన్ని సమాజాలూ, అన్ని నాగరికతలూ తమ అవసరాలకు తగిన, తమ వనరులను ఉపయోగించుకోగలిగిన శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి సాధించాయి. పెట్టుబడిదారీ విధానం ఈ సహజ అభివృద్ధిని అడ్డుకుని, శాస్త్ర, సాంకేతిక అన్వేషణలను తనదైన పద్ధతిలో నిర్వచించి, తన శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి మీద ఇతర దేశాలు, సమాజాలు పరాధీనంగా ఉండే స్థితిని కల్పించింది. సామ్రాజ్యవాదం ఈ స్థితిని మరింత విస్తృతం చేసింది. అందువల్ల స్వావలంబన, శాస్త్రవిజ్ఞానం పరస్పరం ఎదురు బొదురుగా ఉండే శక్తులనే తప్పుడు అభిప్రాయం చలామణిలో ఉంది.

స్వావలంబనకు మొట్టమొదటి కావలసింది వనరుల సమృద్ధి. స్వావలంబనను ఒక మనిషయినా, ఒక కుటుంబమయినా, ఒక గ్రామమయినా, ప్రాంతమయినా, దేశమయినా తన వనరుల మీదనే ఆధారపడి, పరాధీనం కాకుండా ఉండాలంటే మొట్టమొదటి తన అవసరాల గురించి వాస్తవికమైన అంచనా ఉండాలి. ఆ అవసరాలను తీర్చే వస్తువులను, సేవలను తయారు చేయగల వనరులుండాలి. స్వయం సమృద్ధి అని పిలిచే ఈ స్థితి కొన్ని సందర్భాలలో ఉండవచ్చు. కొన్ని సందర్భాలలో ఉండకపోవచ్చు. స్వయం సమృద్ధిని సాధించడమెట్లా అనే వ్యూహంతో నిరంతరం ప్రయత్నించడంతో పాటు, స్వయం సమృద్ధి లేని సందర్భాలలో ఆ వస్తువులూ, సేవలూ సరఫరా చేయగల వాళ్ళ షరతులకూ, ఆంక్షలకూ లోబడకుండా

గౌరవప్రదమైన సంబంధం పెట్టుకోవడమెట్లా అనే వ్యూహం కూడా ఉండాలి.

ఈ అర్థంలో చూసినప్పుడు ఒక వ్యక్తికో, ఒక కుటుంబానికో, ఒక గ్రామానికో వనరుల స్వయం సమృద్ధి లేకపోవచ్చు. కాని భారతదేశంలో దాదాపు ప్రతి రాష్ట్రానికీ అన్ని వనరులలోను స్వయం సమృద్ధి ఉంది. మళ్ళీ అందులో కూడా మధ్యప్రదేశ్ నుంచి పైన కొన్ని ఉత్తరాది రాష్ట్రాలకు సముద్రతీరం లేకపోవచ్చు గాని దేశం మొత్తాన్ని పరిగణనలోకి తీసుకున్నప్పుడు ప్రపంచంలో ఒక్క చైనా మినహా మరేదేశమూ వనరుల స్వయం సమృద్ధిలో భారతదేశంతో సరిపోలదు. చైనాలో కూడా సాగుయోగ్యమైన భూమి భారతదేశంతో పోల్చినప్పుడు తక్కువ.

అందువల్ల స్వాలంబన గురించి చేసే చర్చలో మొట్టమొదటి ఆలోచించవలసిన వనరుల స్థితి, వనరుల స్వయం సమృద్ధి అనే వాటి విషయంలో భారతదేశం ఇతరదేశాలతో పోలిస్తే చాలా మెరుగైన స్థితిలో ఉంది. ఇక్కడ స్వావలంబన సాధ్యంకాదని అనడం పచ్చి అబద్ధం.

స్వావలంబన గురించిన చర్చలో తరువాత చర్చించవలసింది ఆ సమాజప్రజల అవసరాలేమిటనేది. ఒక్కొక్కసారి వనరులకూ-అవసరాలకూ సమతుల్యత సాధించకపోవడం వల్ల స్వావలంబనకు విఘాతం కలుగుతుంది. అందువల్ల సమాజం మొత్తానికి తమకు ఉన్న వనరులేమిటో వాస్తవికమైన అవగాహన కలిగించి వాటిని సమాజం ఎట్లా వాడుకోవడం ఉచితమో వివరించగలగాలి. అంటే వనరుల వినియోగంలో తీవ్రమైన అసమానతలు ఉన్న సమాజంలో ఇటువంటి అవగాహన సాధ్యం కాదు. అప్పుడు నిజంగానే వనరుల కొరత లేదా వనరుల దుర్వినియోగం జరుగుతుంది. అప్పుడు స్వావలంబన రద్దవుతుంది. ఉదాహరణకు ఒక సమాజంలో దొరికే ఉక్కునంతా అటు విలాసవంతమైన కార్లు తయారు చేయడానికి వాడవచ్చు, లేదా ప్రజారవాణా సౌకర్యంగా వాడే బస్సుల తయారీకీ వాడవచ్చు. లేదా రెండు అవసరాలనూ ఏదో ఒక దామాషాలో తీర్చవచ్చు. ఈ మూడు మార్గాలు కాకుండా, ఉక్కును బైటనుంచి దిగుమతి చేసుకొని, బైటదేశానికి అధీనంగా మారిపోవచ్చు. వీటిలో ఏ మార్గమైనా ఎంపిక రాజకీయార్థిక వ్యవస్థలో నిర్ణాయక శక్తుల చేతిలోనే ఉంటుంది.

అంటే స్వావలంబన సాధించాలంటే, ఆ సమాజంలోని నిర్ణయాధికార శక్తులు ఆ సమాజ అవసరాలను నిష్పాక్షికంగా సమీక్షించి, ఏ అవసరాలకు ఎంత ప్రాధాన్యతనివ్వాలో నిర్ణయించి, దాన్ని బట్టి వనరుల కేటాయింపు జరపాలి. అప్పుడు మాత్రమే వనరుల-అవసరాల మధ్య సమతుల్యత ఏర్పడి స్వావలంబనకు మార్గం సుగమమవుతుంది.

ఇక్కడ కూడా భారతదేశం ఉదాహరణ తీసుకుంటే, మన ప్రజల అవసరాలన్నిటినీ తీర్చగలిగిన వనరులు మన దగ్గర ఉండి కూడా, ఒక అత్యల్ప సంఖ్యాక సంపన్న వర్గం తన అవసరాలను పెంచుకుంటూ పోవటంతో, కృత్రిమ వనరుల కొరతకు దారితీసింది. ఈ సంపన్నవర్గం, యూరప్, అమెరికాలలోని సంపన్నవర్గం అనుభవిస్తున్న జీవన సరళిని అనుభవించదలచుకుని దుబారా వ్యయానికి పూనుకుంటోంది. ఈ పరిణామాన్ని ఇటు ప్రభుత్వ విధానాలు, అటు సామ్రాజ్య వాద, బహుళజాతి సంస్థల సరుకుల ఉత్పత్తి విధానం ప్రోత్సహిస్తున్నాయి. దీనితో దేశమే అమ్మేవాడి అంగడిగా మారిపోయి, కొనుగోలు దార్లకు నిజంగా ఏం కావాలో, ఎంత కావాలో అంచనా లేని స్థితి వచ్చింది. అందువల్ల ఒకవైపు అవసరమైన వాళ్ళకు వస్తువులూ సేవలూ అందకపోవడం, మరోవైపు వస్తువులూ, సేవలూ అధికోత్పత్తి జరుగుతుండడం ఉంది. ఇది స్వావలంబనను దెబ్బతీస్తుంది.

స్వావలంబన విషయంలో మరికొంత నిశితంగా ఆలోచిస్తే ఏయేరంగాలలో ఎంత స్వావలంబనను అవలంబించవచ్చుననే విశ్లేషణ చేయవచ్చు. వ్యవసాయం, పరిశ్రమ, సాంకేతిక పరిజ్ఞానం, సేవలు, విద్య, శాస్త్రజ్ఞానం, సాంస్కృతిక ప్రవర్తన మొదలయిన రంగాలను విడివిడిగా పరిశీలిస్తే, ఒక్కొక్క ప్రత్యేక రంగంలో ఆ సమాజానికి ఉన్న సొంత, చారిత్రక, వారసత్వం అనుభవం ఎంత, ఆ అనుభవం తీర్చలేని కొత్త అవసరాలేమయినా తలెత్తుతున్నాయా, ఆ అవసరాలను తీర్చుకోవడానికి స్థానిక వనరులతో, స్థానిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవచ్చునా, లేక పరాయి సమాజాల నుంచి ఎంతో కొంత గ్రహించక తప్పదా, ఆ స్వీకరణ ఏ పరిమితులలోపల జరగాలి లాంటి ఎన్నో ప్రశ్నలకు జవాబులు చెప్పుకోవలసి ఉంటుంది. కొనసాగుతున్న అవగాహనలను మౌలికంగా ప్రశ్నించుకుంటే తప్ప విడివిడిగా ఒక్కొక్క రంగంలో స్వావలంబన సాధ్యమా కాదా అర్థం కాదు.

ఉదాహరణకు వ్యవసాయరంగం తీసుకుందాం. లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియా దేశాలలో-ముఖ్యంగా ఉష్ణమండల దేశాలలో-నదీ తీరాలలో వ్యవసాయ నాగరికతలు కొన్ని వేల సంవత్సరాలుగా అభివృద్ధి చెందాయి. పర్యావరణాన్ని ధ్వంసం చేయకుండా, ఏయే వృక్షజాతులను ఎట్లా పెంచవచ్చునో, ఏయే వృక్షజాతులు ఎటువంటి ఆహార పదార్థాలను సమకూరుస్తాయో కొన్ని వందల తరాల అనుభవం మీద నిర్ధారణ అయింది. నిజానికి ఇదంతా గొప్ప సాంకేతిక పరిజ్ఞానం, గొప్ప శాస్త్ర విజ్ఞానం. పారిశ్రామిక విప్లవం తర్వాత, ముఖ్యంగా ఇరవయో శతాబ్దంలో వ్యవసాయ పనులలో శ్రమను యంత్రాలకు అప్పగించే ప్రయత్నం ప్రారంభమై, తక్కువ మానవ శ్రమతో ఎక్కువ దిగుబడి సాధించడం మొదలయిన తర్వాత, క్రమంగా వ్యవసాయ రంగంలో దక్షిణార్ధగోళపు దేశాల సాంకేతిక విజ్ఞానం కన్న, ఉత్తరార్ధగోళపు పారిశ్రామిక దేశాల సాంకేతిక విజ్ఞానానిది పైచేయి కావడం మొదలయింది. ఈ క్రమంలో వ్యవసాయ పరికరాల రంగంలో నుంచి ఎరువులు, క్రిమి సంహారకాలు, విత్తనాలు వంటి రంగాలలోకి కూడా పారిశ్రామిక దేశాల సాంకేతిక విజ్ఞానం విస్తరించి, మూడో ప్రపంచ దేశాల సాంప్రదాయిక వ్యవసాయ పరిజ్ఞానమంతా

ఆంధ్రప్రదేశ్
అవతరణ దినోత్సవ
శుభాకాంక్షలు



# అగ్రగామి ఆంధ్రప్రదేశ్



## నేడే ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం

ముఖ్య అతిథి : డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి, ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్

వేదిక: ఎన్.టి.ఆర్.స్టేడియం, ఇందిరాపార్క్ దగ్గర, హైదరాబాద్. సమయం: ఉదయం 9 గంటలకు

**తెలుగు మాట్లాడే ప్రజలందరూ ఒక్కటిగా కలసి ఉండాలనే మహదాశయంతో ఎందరో మహానుభావుల అమూల్య త్యాగాల ఫలితంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించింది. ప్రాధాన్యతారంగాలైన వ్యవసాయ, పారిశ్రామిక, సంక్షేమ రంగాలలోనే కాకుండా అన్ని రంగాలలో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా.. 'హరితాంధ్రప్రదేశ' లక్ష్యంగా.. ప్రగతి మార్గంలో పయనిస్తోంది.**

జారీ చేసిన వారు : సమాచార, పౌర సంబంధాల శాఖ

RNI Regn. No. APTEL/2003/11482

PRINTED BOOK

Postal Regn. No. LII/RNP/H-HD-1029/2004-06



పనికిరానిదిగా చూడడం మొదలయింది. వేల ఏళ్ళుగా వినియోగంలో ఉన్న, పర్యావరణ సమతుల్యాన్ని కాపాడే ఎరువులు, రైతులు సాంప్రదాయకంగా, వారసత్వంగా పరిరక్షించుకునే వందలాది వంగడాల విత్తనాలు తెరమరుగయిపోయి, రసాయనిక ఎరువులు, హైబ్రిడ్ విత్తనాలు వ్యవసాయరంగంలోకి ప్రవేశించాయి. ఇవి ఎక్కువ దిగుబడినిస్తాయని చెప్పినప్పటికీ, వాటి సాంఘిక, పర్యావరణ వ్యయాన్ని పరిగణనలోకి తీసుకుంటే, ఆ దిగుబడికి ప్రయోజనం హళ్ళికి హళ్ళికి సున్నకు సున్న అవుతుంది. ఈ అధిక దిగుబడి వంగడాల వల్ల జరిగిన మరొక ముఖ్యమైన పరిణామం, అవన్నీ ఎక్కువగా చీడ పీడలను, కొత్త క్రిములను ఆశించేవి కావడం. అందువల్ల కొత్త క్రిమిసంహారక మందులు అవసరమయ్యాయి. ఈ మొత్తం క్రమం అంతిమంగా మన వ్యవసాయరంగాన్ని బహుళజాతి ఎరువుల, విత్తనాల, క్రిమిసంహారక మందుల కంపెనీల దయాదాక్షిణ్యాలకు బలిచేసింది. వేల ఏళ్ళుగా సాగుతున్న మన వ్యవసాయరంగం, మన రైతుల సాంప్రదాయక విజ్ఞానం స్వావలంబనను కోల్పోయి, పూర్తిగా పరాధీనం అయిపోయాయి. వీటికి తోడు కొత్త పంటల ప్రాసెసింగ్, మార్కెటింగ్, రవాణా ప్రక్రియలన్నిటి మీద కూడా రైతులకు కాక బహుళజాతి సంస్థలకు, వారి దళారీలకు నియంత్రణ ఉండడంతో అక్కడ కూడా స్వావలంబన రద్దయిపోయింది.

చాలా క్లుప్తంగా వివరించిన ఈ వ్యవసాయరంగ ఉదాహరణ మన స్వావలంబన ఎట్లా క్షీణించిందో, అంతిమంగా వ్యవసాయరంగం మొత్తం పరాధీనమైపోయిందో చూపుతుంది. నిజానికి ఈ క్రమాన్ని చాలా వివరంగా, సూక్ష్మస్థాయి నుంచి, స్థూల స్థాయి వరకు చూడవచ్చు. ఇటువంటి క్రమాలే పరిశ్రమలలో, సాంకేతిక పరిజ్ఞానంలో, విద్యలో, సేవారంగంలో, శాస్త్రవిజ్ఞానంలో, సాంస్కృతిక రంగంలో గుర్తించవచ్చు.

ఇలా స్వావలంబన కోల్పోవడం వల్ల, పరాధీనత పెరగడం పర్యవసానాలుగా, మన ఆర్థిక వనరులు విదేశాలకు, బహుళజాతి గుత్త సంస్థలకు, సాంకేతిక పరిజ్ఞాన హక్కుదార్లకు తరలిపోవడం, మన సాంస్కృతిక జీవితంలో అవాంఛనీయమైన ధోరణులు తలెత్తడం, అయినదానికీ కానిదానికీ ఇతరుల మీద ఆధారపడవలసి రావడం, మనలో న్యూనతాభావాలు తలెత్తి మనకు నాణ్యతా ప్రమాణాలు లేవని, మనం కొన్ని పనులు చేయలేమని మనమే అనుకోవడం వంటి దుష్పరిణామాలు తలెత్తుతాయి.

అయితే స్వావలంబన విధానాలను అమలు చేయాలని, ఏ సమాజమైనా, దేశమైనా స్వయం ఆధారితంగా, మరొకరి మీద ఆధారపడకుండా, సొంత కాళ్ళమీద నిలబడాలని వాదించేటప్పుడు, దాని అర్థం తలుపులు మూసుకుని కూచోవాలని కాదు. సహజ వనరులలో, శాస్త్ర విజ్ఞానంలోనయితే చాలా దేశాలు వెనుకబడే ఉన్నాయి. (అయితే ఈ వెనుకబాటు అనేది కూడా సామ్రాజ్యవాద నిర్వచనాల నుంచి చెప్పేదే. ఐదారువందల సంవత్సరాల పెట్టుబడిదారీ దోపిడీ వల్ల, వలసవాద, సామ్రాజ్యవాద చరిత్ర వల్ల మూడో ప్రపంచదేశాలలో స్వతంత్ర శాస్త్ర విజ్ఞాన అభివృద్ధి ధ్వంసమైపోయి, యూరోపియన్, అమెరికన్ శాస్త్ర విజ్ఞానమే కొలబద్దగా మారిపోయింది). అందువల్ల కొన్ని రంగాలలో ఆ దేశాలు విదేశీ సహాయాన్ని అర్థించవలసి వస్తుంది.

అట్లాగే, అర్థశాస్త్రంలో ఒక్కోదేశానికి తులనాత్మకంగా ఉండే హెచ్చు అవకాశాల గురించి మాట్లాడతారు. ఒకే దేశంలో వరి పండించడం ఎక్కువ లాభదాయకమైతే, మరో దేశంలో చెరకు పండించడం ఎక్కువ లాభదాయకం కావచ్చు. అటువంటప్పుడు ఎవరికి ఏ రంగంలో ఎక్కువ ప్రయోజనం ఉంటుందో, ఆ రంగం మీదనే కేంద్రీకరించి, ఇతర రంగాలలో విదేశీ సహాయం తీసుకోవచ్చు

అయితే ఈ రెండు సందర్భాలలోను, ఆదాన ప్రదానాలు, ఇచ్చిపుచ్చుకోవడాలు పరస్పర ప్రయోజనకరంగా, సమానమైన స్నేహ పూర్వకమైన సంబంధాల మీద ఆధారపడి ఉన్నప్పుడే స్వావలంబన కొనసాగుతుంది.

భారత చరిత్రలో వలసవాదం వల్ల, జాతీయోద్యమ క్రమంలో స్వావలంబన ఆలోచనలు విస్తృతంగా వ్యాపించాయి. బ్రిటీష్ వలస వాదం మన వ్యవసాయ, పారిశ్రామిక రంగాలను ఎట్లా దెబ్బతీసి, పరాధీనం చేసిందో స్పష్టంగా అర్థమైన తర్వాత జాతీయోద్యమం స్వావలంబనను ఒక ముఖ్యమైన ఆశయంగా గ్రహించింది. అందువల్లనే రెండో, మూడో పంచవర్ష ప్రణాళికల్లో స్వావలంబన మీద కేంద్రీకరించడం జరిగింది. కాని క్రమక్రమంగా భారత పాలక వర్గాలు స్వావలంబనను తుంగలో తొక్కి, దేశాన్ని సామ్రాజ్యవాద రథ చక్రాలకు కట్టివేశారు.



Owned, Printed and Published by V.Hanumantha Rao at D.No.8-3-898/22, Road No.3, Nagarjuna Nagar, Hyderabad-5000 073 Ph: 23748672, DTP at Samata Graphics, Hyderabad. Printed at Akruti, Chikkadapalli, Hyderabad. Editor: V.Hanumantha Rao

VEEKSHANAM
TELUGU FORTNIGHTLY
1070, NAGARJUNA NAGAR
HYDERABAD-500073